ఓమ్.

# అహంగ్రాహిని.

అను సూటిమార్గప్రదర్శిని.

## ద్వితీయ గ్రంథము



శ్రీ మునిపల్లె చినబాపయ్యగారి శిష్యులు

అనాసవరపు పుండరీకాక్షునిచే

రచియింపబడి,

తెనాలి లలిత ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడియె,

ప్రథమ ముద్రణము 1000 ప్రతులు.

1928.



కాపీ రైటు] [రు 0-8-0

# విషయసూచిక



# గురుసమర్పణ

ఈ గ్రంథము మత్కారణాచార్యులగు

శ్రీ మునిపల్లె చిన బాపయ్యాబాబుగారి కీర్తిచంద్రికకు

సమర్పించడమైనది.

# విజ్ఞాపనము

ఇయ్యది అహంగ్రాహిని ద్వితీయగ్రంథము. ఇందు భగవంతునికి శివకేశవ స్వరూపములు వస్తుతః యున్నట్టునూ మానవులందరు స్త్రీపురుష భేదము లేకుండా అట్టి శివకేశవ స్వరూపములను తమలోతామే దర్శించుటకు అర్హులయినట్టునూ గ్రంథ దృష్టాంతములతో వ్రాయబడియున్నది. శివకేశవదర్శనముగల పఠము యిందులో చేర్చకపోవుటకు ద్రవ్యలోపమే ప్రధానమైయున్నది. ఒకవేళ చేర్చిననూ అందుకు సంబంధించిన నియమములు గల ప్రథమగ్రంథము లేనిది పఠములోని సంగతులు గ్రాహ్యములుకావు. సదరు పఠమును హృదయకమలమును ప్రథమగ్రంథముతో ముద్రింపించదలచి యీ ద్వితీయగ్రంథమును ముందుగా అచ్చొత్తించియీక్రయధనమును ప్రథమగ్రంథముద్రణకువినియోగపరచదలచినాను

ప్రథమగ్రంథ ప్రకటన నిమిత్తమే ముందుగా యీ ద్వితీయగ్రంథ ప్రకటన అయివున్నది.

ఆస్తికులు అందరునూ యీగ్రంథము కొనుట మూలముగా ప్రథమగ్రంథ ప్రకటనను ప్రోత్సాహపరచి శైవ వైష్ణవవిభూతులు లోకమునకు వెల్లడిచేయ ప్రార్థించుచున్నాను. ఈపని అంతాలోకముదే అయివున్నదిగాని ఏవ్యక్తియొక్కయు స్వంతముకానేరదు.

తెనాలి,
30_6_28.

అనాసవరపు పుండరీకాక్షుడు.
రిటైర్డు తాలూకాక్లర్కు, నాజరుపేట,

# అవతారిక.

శ్లో. శ్రీమద్భక్తజనౌఘ చిత్తనిలయం, చిద్రూపహృద్గోచరం
దత్తాత్రేయకులాబ్ధిపూర్ణశశినం స్మేరాననం చిన్మయం
నిత్యం సత్యమనంతమవ్యయపరంసిద్ధార్థదం కారణం
దాంతిశాంతిశమాధికం గురువరం శ్రీరామచంద్రం భజే.

అని గురుగీతలలో ప్రథమమందు చెప్పబడిన తీరుగా ఇట్టి భగవంతుని కనుగొనుటకు ఈగ్రంథములోని విషయములు నాలుగే. గ్రహణం, మోక్షం, ఆనందం, దర్శనం అనునవి. ఈనాలుగు మామూలుగా మనము మాట్లాడుకునే మాటలతో అందరికి తెలియులాగున వ్రాయడమైనది. ప్రథమగ్రంథములో శైవవైష్ణవవిభూతులు, విశ్వరూప సందర్శనములు, శివకేశవ స్వరూపములు విరళముగా నిరూపించడమైనది. భగవంతుడు అవాఙ్మానసగోచరుడని శాస్త్రములు చెప్పుచున్నవి.

స్వరూపము కలదా లేదా అనునదియే ప్రథమశంక.

శ్లో. నతుమాంశక్యసేద్రష్టుమనేనైవస్వచక్షుషా
దివ్యందదామి తే చక్షుఃపశ్యమే యోగమైశ్వరమ్.

శ్రీభగవద్గీత 11 అధ్యాయం 8 శ్లోకం—

ఈతోలుకన్నులతో నన్ను చూడజాలవు. దివ్యదృష్టి యిస్తాను. నావిభూతియోగమును చూడుము అని శ్రీకృష్ణభగవానులు అర్జునునికి చెప్పియున్నారు.

శ్లో॥ ఆశ్చర్యవత్పశ్యతికశ్చిదేనమాశ్చర్యవద్వదతితథైవచాన్యః
ఆశ్చర్యవచ్చైనమన్య శృణోతి శ్రుత్వాప్యేనం వేదన చైవ
కశ్చిత్.

శ్రీభగవద్గీతలు 2 అధ్యాయం 29 శ్లోకం

ఒకానొకడు ఈఆత్మను ఆశ్చర్యముగా చూచును. మరియొకడు ఆశ్చర్యముగా ఒకనితో చెప్పును. వేరొకడు ఆశ్చర్యముగా వినును. ఇంకొకడు వినిననూ ఈఆత్మను తెలిసికొననేలేడు.

అని శ్రీకృష్ణభగవానులు అర్జునునకు చెప్పినారు. భగవంతునికి స్వరూపమున్నట్లునూ అస్వరూపముచు కొందరు అర్థాలు చూచుచున్నట్లునూ గీతలనుపట్టికనపడుచున్నది ఆస్తిక మతావలంబులమై సాధన చతుష్టయ సంపన్నులమైన యెడల భగవంతుని దర్శించుటకు ఉపాయములు పెద్దలు కనిపెట్టి భారత, భాగవత, రామాయణాది గ్రంథములలో యిదివరకే లిఖించియున్నారు. అక్కడక్కడ భగవద్దర్శనమునుగురించి ఆయాగ్రంథములలో చెప్పబడిన పద్యములు కొన్ని యీగ్రంథములో సందర్భానుసారముగా కనపర్చినాను.

శివకేశవులకు అభేదము అని మన సంధ్యావందన దేవతా నమస్కారములో చెప్పబడియున్నది. అభేదము దర్శించిననే శివుడు కేశవుడు, కేశవుడు శివుడు, అని ఒప్పుకొనగలము. దర్శనములేకుండానే యిప్పుడు మన అద్వైత మతస్థులము శివకేశవులకు అభేదము అని చెప్పుచున్నాము.

బ్రహ్మాండపురాణే॥ శ్లో॥ మద్భక్తో శంకరద్వేషీ మద్వేషీ శంకరప్రియః। తౌఉభౌనరకంయాంతి యావచ్చంద్రదివాకరా॥ అనగా కేశవభక్తుడు శంకరుని ద్వేషించిననూ శంకరభక్తుడు కేశవుని ద్వేషించిననూ వారిరువురు సూర్యచంద్రులుండువరకు నరకములో ఉందురు అని బ్రహ్మాండపురాణము మొదలైన వాటిలో ప్రమాణములుండుటను పట్టి మనము చూడకపోయి ననూ ఆనరకశిక్షకు మనము గురియగుదుమేమో నను సంశ యముచేత శివకేశవులకు అభేదము అనిఒప్పుకొనుచున్నాము. ఇట్టి భయసంభ్రమములు భ్రమకు మూలము. శివకేశవ స్వరూపమైన పరమాత్మను దర్శించుటకు మార్గము యీ గ్రంథములో కనుపించును.

శైవవైష్ణవవిభూతులను సహస్రారముందలి కళ నిష్క ళలయందు కనిపెట్టి యీఅహంగారిహాని ప్రథమగ్రంథము 25 ప్రకరణములుగా తయారు చేసియుంటిని. చదువరుల ప్రోత్సాహమునుపట్టి త్వరలో సదరు ప్రథమ గ్రంథము అచ్చొత్తించబడును.



శ్రీసద్గురుపరబ్రహ్మణేనమః.

# అహంగ్రాహిని.

## ద్వితీయ గ్రంథము.

## గ్రహణము = పట్టు.

గ్రహణము అనగా పట్టుకొనుట. ప్రపంచములోని జీవులందరును మహాకారణ తనువులోని స్థూలసూక్ష్మ కారణ శరీరములను గ్రహణము చేయుచున్నారు. ఇట్లు గ్రహణము చేయుటలో సూక్ష్మశరీరము సృష్టిలగాయతు మోక్షపరియంతము ఒక్కటియే అయివున్నది. సూక్ష్మ శరీరము పుట్టుటకు హేతువు అవిద్యారూపమైన కారణ శరీరము. సూక్ష్మశరీరము స్థూలోపాధికి రావడము జననమున్ను ఆస్థూలోపాధిని వదలిపెట్టుట మరణమున్ను, అయినట్లు కనబడుచున్నది. సూక్ష్మ శరీరములోని అంతఃకరణయందు ప్రతిబింబించిన పరమాత్మస్వరూపుడే జీవుడు. ఈజీవుడు ప్రజ్ఞాన స్వరూప ప్రత్యగాత్మ అయి వున్నాడు. మూడు శరీరములు జడములై యున్నందువ ప్రత్యగాత్మయే ఆయా యింద్రియముల ద్వారా విషయములను గ్రహణము చేయుచున్నాడు. తాను ప్రత్యగాత్మ గాను, తనకుమించి వున్నదంతా విషయాకార

ప్రపంచముగా దోచే విరాడ్రూప పరమాత్మ యందలి విషయములు గాను గురూపదేశానంతరం విచారణ పరులకు తోచుచున్నది.

“వ్రతానా ముత్తమం వ్రతం” అను సామెతను బట్టి యోగులు యోగమును, శాస్త్ర పండితులు పాండిత్యమును, రాజయోగ సాంప్రదాయకులు బ్రహ్మస్వరూపమందు ప్రత్యగాత్మ ఐక్యమును, అచలులు అచల తత్వమును యిటుల వారివారికి యిష్టము వచ్చినట్లు వారివారి మతమును మెచ్చుకొనుచున్నారు, గాని ఇట్టి మార్గములు అన్ని బ్రహ్మైక్యాను సంధానమునకే యేర్పడిన వని అన్యమార్గావలంబకులయందు యేమాత్రమైనా ఆదరణ కనపర్చుటకు బదులు ఉపేక్షయైనా కనపర్చక తమ రవలంబించిన దానికి అన్యమైనదంతా అశాస్త్రీయము అననుచరణీయము అని యనుచున్నారు.

ఇట్టి విమర్శలు చేయువారు ఆ అన్యమార్గములలో వుండే నిబంధ నాదులను గమనించి ఆయామార్గములను బాగా పరిశీలించి అనుచరించిన యెడల తమ స్వంతమార్గములో చెప్పిన గమ్యస్థానమే ఆయా మార్గములకున్నూ గమ్యస్థానమైనట్లు ఒప్పుకొనగలరు.

ఒక పట్టణమునకు అనేక పల్లెలనుంచి బాటలెట్లు గలవో బ్రహ్మమును కనుగొనుటకు అనేక మార్గములుండ

వచ్చును. ఈమార్గముల వలన చేరెడి గమ్యస్థానమెట్లు అయినను ఒకటియే గాని వేరుగాదు.

ప్రత్యగాత్మ మనలో సహస్రారమందు వున్నదనిన్ని అది అణువులో అణువై నీవారశూకము కొనవలె ఆకృతి కలిగి కోటి సూర్య చంద్రుల కాంతితో ఆకాశతత్వమైన కళ యందు నిష్కళాస్వరూపముగా ప్రకాశించుచున్నదనిన్ని సూటిమార్గసాంప్రదాయకులు శిష్యులకుబోధిస్తూయున్నారు.

ఇట్టి నిష్కళను కుడియెడమ దృష్టులవల్ల చూచిన యెడల శైవవైష్ణవ విభూతులు స్పష్టముగా కనపడగలవు. ఈవిభూతులు నిర్గుణమా సగుణమా అని ప్రశ్నరాగలదు. అనుభవవేద్యముగనుక మనసూటి మార్గస్తులు శైవవైష్ణవ విభూతులను దర్శించి శైవవైష్ణవ విదేహకైవల్యముల యేకీభావమునుపొంది ఆనందించుదురుగాక.

ఇట్టి విభూతులు తేలికగా గ్రహించుటకు మన యిండ్లలో మాట్లాడుకునేమాటలతో అవతారిక గురుసమర్పణ గాక 25 ప్రకరణములుగా ప్రధమగ్రంధము తయారుచేసి యుంటిని.

ఈ శైవ వైష్ణవ విభూతులు పొంద తగినవారు సూటి మార్గమవలంబించిన వారుగాని తదన్యులుకారు. సూటిమార్గస్తుల చూపులోని రహస్యము శైవవైష్ణవవిభూతులే అనగా శివకేశవ స్వరూపములను వారివారి విశ్వరూప సందర్శ

నములను దర్శించుటయేని గాని వేరు కనుపించదు. ఈ సూటిమార్గస్థులు నిత్యముక్తులు. ఇట్టి సూటిమార్గమవలంబించి శైవ వైష్ణవ విభూతులను దర్శించుటకు ప్రతివానికి వాక్కువున్నను మనోజయము లేనందుననే మనపూర్వీకులు మనస్సును నెమ్మదిగా జయించుటకు సగుణ నిర్గుణములని మార్గములు యేర్పరచి శైవవైష్ణవాది సంప్రదాయకములని మతములను కట్టుబాట్లను సూటిమార్గము నవలంబించియే నిర్ధారణచేసినారు. ఆయామార్గములు మతములను అవలంబించినవారు ఆయా కట్టుబాట్లను అనుసరించి చరించుచూ గమ్యస్థానము చేరుటకు తమదిన్ని ఒకమార్గము ఒకమతము అను రూఢిలేనివారై తమ సెట్టులోకి చేరనివారిని నిందించుచున్నారు. ఇట్లు నిందించుట గమ్యస్థానమును చేరగలరని మతములను మార్గములను యేర్పరిచిన మన పూర్వీకుల అపార దర్శనమునకు ఉద్దేశమునకు వ్యతిరేకమైనట్లు కనుపట్టుచున్నది. ఇతర మతనిందలేకుండా తమమతమును అచంచల మనస్సుతో సేవించినయెడల మనస్సు ఆమతమందు చెప్పబడిన దేవతయందు ఆరూఢమగును. మనస్సు అంతఃకరణమేగనుక స్వభావముగానే స్వచ్ఛమై యున్నందున అప్పుడు సూటిమార్గమును అవలంబించి తన మార్గము యితరమార్గములయందు చెప్పబడిన దైవములు అన్ని సుషుమ్నాంతర్గత కళయందే వర్ణించబడి యున్నట్లు

స్పష్టము కాగలదు. దేవీ ఉపాసకులు, శైవ వైష్ణవ గాణా పత్యాదులు సుషుమ్నాంతర్గత నిష్కళాస్వరూపమునే తమ ఉపాసన దేవతలుగా యేర్పరుచుకున్నట్లు స్పష్టముగా కనపడుచున్నది. ఇందుకు దృష్టాంతములు అనేకములు ఆయా గ్రంథములలో ఉన్నవి. చదువరులు ఆయా దేవతల పూజ నామావళులలోను నామావళుల శ్లోకములలోను చూచుకొన వచ్చును.

మతకర్తల ఉద్దేశము పామరజనులను పైమోస్తరుగా గమ్యస్థానమునకు తీసుకుని వెళ్ళి వదలిపెట్టుటయే గాని ఆ మతావలంబకులు తమ మతమును తాము బాగా అవలంబించక యితర మతములయందు అసూయతకలిగి తమ గమ్య స్థానమును దూరము చేసుకొని అధోగతిని పడమనిమట్టుకు కాదు. ఎందువల్లననగా మతస్థులందరు సుషుమ్నాంతర్గత మహాకళను అందలి నిష్కళను గురించి చేసిన స్తోత్రములనే చదువుచున్నారు ఆదేవతలనే ఆరాధించుచున్నారు. ఇట్లు చేయుచున్నను తమ అంతఃకరణ స్వచ్ఛము కానందున ఆ సంగతి బాగా పరిశీలించి ఏకత్వమును బొందలేక పోవు చున్నారు. ఉపాసనదేవతలందరికిన్ని ఈశ్వరశక్తులు అన్ని ఉన్నట్లు వారివారి మతములలోనే చెప్పియున్నారు. గమ్య స్థానమును చేరక ఒకరికొకరు పోట్లాడుట మతములకు తారా

తమ్యములు మెంచుట అపరిపక్వ అంతఃకరణ గలవారికి లక్ష్యణముగాని గమ్యస్థాన వివేచనపరులకు యేమాత్రమును ఒక మతమునకు ఇంకొకమతమునకు ఒకమార్గమునకు యింకొక మార్గమునకు భేదము కనుపించదు.

ఎట్లు విచారించినను గమ్యస్థానము బ్రహ్మమే. ఆ బ్రహ్మమును పొందుటకె సూటిమార్గ మవలంబించి దృగ్బ్రిహ్మముకు నేర్పడివున్న శైవవైష్ణవ విభూతులను దర్శించవలెను. ఆదర్శనమువల్ల అంతఃకరణోపాధి స్వచ్ఛము కావలెను. స్వచ్ఛమైన అంతఃకరణయందుగాని శైవ వైష్ణవ విభూతులు కనపడవు. ఆ శైవవైష్ణవ విభూతులు రెండున్ను విరాట్పురుషుని ఆకృతులే. ముక్తికి విరాట్పురుష ఉపాసనె ముఖ్యము. ఇతరమార్గములు పనికిరావు. గనుక సూటిమార్గ గ్రహణము చేయతగినది.

మహాకారణ తనువులోని స్థూల సూక్ష్మకారణ శరీరములను గ్రహణము చేయుచున్న జీవులు తమ నిజస్వరూపములను వీక్షించి బ్రహ్మ స్వరూపమును గ్రహణముచేయవలెను. జీవులందరు బ్రహ్మస్వరూపులేగనుక బ్రహ్మమె అగుదురు తామరాకు చెదరగానె తామరాకుమీది నీరు అడుగునవున్న నీటిలోకలిసి మరల విడతీయుటకు వీలుకానట్లు జీవుడేబ్రహ్మమగును. ఎట్లనగా "నాహంజీవః పరాత్మేతిజ్ఞా

తశ్చే నిర్భయం భవేత్ ” అను శ్రీ ఆచార్య స్వాములవారి ఉదాహరణమే ప్రమాణము.

గనుక జీవులు సృష్టిలోని తనువులను గ్రహణము చేసి అవస్థలు పడుటకంటె తమ అసలు స్వరూపమునకు హేతువైన బ్రహ్మమును గ్రహణము చేయుట అత్యుత్తమమైన పరమపదమార్గము.



శ్రీసద్గురుపరబ్రహ్మణేనమః.

# అహంగ్రాహిని.

## ద్వితీయ గ్రంథము.

## మోక్షము-విడుపు.

మహాకారణతనువులోని స్థూల సూక్ష్మ కారణ శరీరములను గ్రహణము చేయుచున్న జీవులు తమ నిజస్వరూపమును వీక్షించి బ్రహ్మస్వరూపమును గ్రహణము చేయుటే మోక్షము. బ్రహ్మ స్వరూపమును జీవులు గ్రహణము చేయుటన్నను స్థూల సూక్ష్మకారణ మహాకారణములను వదలిపెట్టుటన్నను ఒక్కటే. గ్రహణము మోక్షము అను రెండున్ను జీవత్వలక్షణములేగాని బ్రహ్మ లక్షణములు కావు. పరమపదానికి మరియొకటి విలక్షణమైనది. ప్రపంచక దృష్టి ఉన్నంతవరకు మనకు యీరెండున్ను తోచుటలేదు. ఎందువల్ల ననగా మనము సంసారమునందలి పామరత్వముచేత విచారణపరులముగా లేము. విచారణపరులు అనగా జిహ్వా ఉపస్థల భోగమునకు విషయములను సమకూర్చుకొనువారు కారు. ఆ రెంటిని వదలిన విచారణపరులు అని యిప్పటిమన భావము గ్రాహ్యము.

వేదమతమునందు ప్రవృత్తి నివృత్తి అను రెండు మార్గములు కలవు. ప్రవృత్తి పామరులకు కర్మలయందు ఆసక్తిని కల్పించి సత్కర్మద్వారా చిత్తశుద్ధిని తద్వారా మోక్షమును క్రమేణ పొందుటకు అవకాశమును కలుగ చేయుచున్నది. నివృత్తి మార్గము చిత్తైకాగ్రతవల్ల మోక్షమును యిప్పుడే పొందుటకు తగిన అవకాశమును కలుగచేయుచున్నది. నివృత్తి మార్గమును పొందినవారే జిహ్వోపస్తలను వదలినవారు. మనయందు ముఖ్యదిమాడు మూరల పేగువున్నది. దానికి ఆదియంత్యములు జిహ్వోపస్థలు. ఈ రెంటియందు ఆనందము సమానము. ఈ ఆనందము స్థూలశరీరము నందుండు జీవులందరికి సమానమే. సృష్టియందలి జంతువులన్నిటికి యీ రెండు సహజావస్థే. ఈ ఆనందము లేని జంతువే లేదు. పక్షి, పశువులు మొదలైన జంతువులు అన్నిటికి దేహము అడ్డముగా తిర్గి భూమి వైపుకు చూపుగలవిగా వున్నందున సృష్టిలోని సంగతులను గమనించి సృష్టి వైచిత్రియములను మనస్సున తలచుకొన్ని భగవంతుని ధ్యానించుటకున్నూ యోగాభ్యాసము, ఆసనములు, ముద్రలు, అభ్యసించుటకు తమ దేహమును నిర్యామకపు స్థితిలో ఉంచుటకున్నూ వాటికి అవకాశము లేదు. ఒక్క మానవునికిమట్టుకే అట్టి సదుపాయము పొందుటకు తగిన తీరుగా భగవంతుడు సృష్టించినాడు. ఉత్తమమైన మనుష్య జన్మము 84 లక్షల యోనుల యందలి జన్మములకు పైదిన్ని, ఊర్ధ్వలోక సంబంధమైన దేవతాశరీరములకు క్రిందిదిన్ని అయి వున్నది. మానవుడు యిక్కడ సరియైన విధుల ననుసరించి

ప్రవర్తించిన యెడల దేవతాదిశరీరములను, నిషిద్ధప్రవర్తన కలవాడైన యెడల తన క్రింది 84 లక్షల యోనుల యందలి జన్మమును పొందును. సత్ప్రవర్తన కలిగి తనకు భగవద్దర్శనము లభించేవరకు మానవుడుగానే వుండుటకు ప్రయత్నించవలెను. యెందువల్లననగా క్రిందిజన్మలలోగాని, దేవతాదిమీది జన్మలలోగాని ఉన్న జీవులు ఆయాజన్మములలో జ్ఞానమును సంపాదించి భగవంతుని పొందుటకు వీలులేదు. ఒక్క మానవజన్మమట్టుకే భగవంతుని పొందుటకు వీలుకలదు. సాధనచతుష్టయము అవలంబించిన భగవంతుని పొందుటకు వీలు కలుగును. మొదటి సాధనజ్ఞానమైన నిత్యానిత్యవస్తువివేకము. రెండవ సాధన యిాలోక పరలోక సుఖములయందు విముఖుడై వైరాగ్యము కలిగి వుండుట. మూడవది శాంతాది గుణములను సంపాదించి ఉపశమనశీలుడౌటయే.

నాల్గవ సాధన మోక్షమందలి కోరిక. ఈనాలుగు యెప్పుడు కలుగునో అప్పుడు భగవంతుడు గురువు రూపేణ సాక్షాత్కరించి సంశయ నివృత్తిచేయును. అనగా దేహము మనస్సు యింద్రియములయందు ఆరోపించే అహమును నేతి నేతి వాక్యములవల్ల విడదీసి మహావాక్య ఉపదేశమువల్ల బ్రహ్మమే అని కనపర్చును. ఆగురువే భగవంతుడు. ఆయనే శైవవైష్ణవ విభూతులతోవున్న కేవల పరబ్రహ్మ స్వరూపుడు "శశ్వభగవాన్ మహేశ శ్శంకరనారాయణాత్మక:" అని శ్రీ ఆదిశంకర భగవత్పాదులవారి ప్రశ్నోత్తరములలోవున్నది. ఈవిభూతియే అహంగ్రాహిని అను ప్రథమ గ్రంథమందు ప్రతి

ప్రకరణములోను కుడి యెడమ చూపులవల్ల కనుగొనవచ్చు
నని స్పష్టముగా వ్రాయబడియున్నది. అభ్యాసకులు సదరు
ప్రథమ గ్రంథము ప్రకారం పనిచేసి తరించుదురు, గాక.
ఇంకా సదరు చూపులలోని రహస్యము యీమోస్తరు గ్రం
థములందు బాగుగా విశదీకరించబడుచున్నది. మన గ్రంథ
ములను శాస్త్రమును పట్టి శివకేశవాది దేవులకు చెప్పబడిన
స్వరూపములను మనస్సుయందు ఆరూఢిచేసుకుని గురువు
చెప్పేమంత్రమును ధ్యానమునుచేయగా మనస్సు యితర విష
యముల యందలి పట్టువదలి తన ఉపాసన దేవతయందు
స్థిరపడినప్పుడు తాను ఉపాసనచేసే దేవత తనమనస్సునకు
గోచరమగును. అప్పుడు సర్వశక్తులుకూడాకలుగును. అన్న
మాట చెల్లుచుండును. అంతటితో తమ ఉపాసన సిద్ధి అయి
నట్టు యెంచుచు ధీరులై వుంటున్నారు. అయితే యిట్టి స్థితి
సద్విషయమై ప్రపంచకవృత్తులను తగ్గించుచున్నందున అష్టై
శ్వర్య సంబంధమైన శిద్ధులు కలుగుచున్నవి. ఇప్పుడు మనము
ఆచరించుమార్గము పైనచెప్పిన మార్గముకాదు. దహరా
కాశమందు దృగ్మయబ్రహ్మమును శైవ వైష్ణవ విభూతులతో
దర్శించి శైవ వైష్ణవ విదేహ కైవల్యముల యేకీభావమును
పొందుటేమన మార్గము. ఇదే సూటిమార్గము. దృగ్బ్రహ్మ
స్వరూపముగా వుండే శైవవైష్ణవమూర్తులను వారివారి విశ్వ
రూప సందర్శనములను చూచుటే సూటిమార్గము. దృగ్మయ
బ్రహ్మము దృక్కేగనుక తక్కిన ఉపాసనకాండలోనివారివలె
తనకు గోచరించినది నిజమైనదా లేక మనోబలమువల్లయేర్ప

ఇట్లు ముక్తికాంతను పెండ్లాడినవారే నివృత్తిమార్గమును పొంది జంహాఉపస్తలను వదలినవారు. వీరే శైవవైష్ణవ విదేహకైవల్యముల యేకీభావమును పొందినవారు. వేరైన వారందరూ ప్రవృత్తిమార్గస్తులు.

ప్రవృత్తిమార్గమే స్థూలాంగముల యెడతెగని సమూహమునకు కారణమగుచున్నది. ఇదియే నివృత్తిమార్గస్తులకు పిచ్చిగా కనుపడు మార్గము. ప్రవృత్తిలోవుండి నివృత్తిని విచారించుటవలన లోకమును వంచించుటకు తనయందు లోకమునకు గురికుదురుటకు తగు వచనరచనత్వము కలుగును గాని నివృత్తినిష్ఠలోని లాభము సిద్ధింపదు. నివృత్తి స్థిరపడుచే ప్రవృత్తిని వదలుట. ప్రవృత్తిని వదలుటచే నివృత్తిని పొందుట. ప్రవృత్తి నివృత్తులు రెండున్నూ జీవభ్రాంతులు. అహంపదార్థము బ్రహ్మపదార్థ మగుటకు అనగా జీవుడు ఈశ్వరుడు అగుటకు నివృత్తిమార్గము యేర్పడినది.

ఇట్లు నివృత్తిమార్గమందు స్థూలదేహనాశన పర్యంతము నడుచుకొన్నయెడలను, శైవవైష్ణవ విభూతులంలో వున్న దృగ్మయబ్రహ్మమును యెల్లప్పుడు గమనించుచుండిన యెడలను ఆభాసరూపము గావుండే జీవుడు తన నిజ స్వరూపమైన ప్రత్యగాత్మయందు లీనమగును. ప్రత్యగాత్మ 26వ తత్వము, 27 వ తత్వము ఈశ్వరుడు. ఈసంగతి యీఅహంబ్రాహ్మిని ప్రథమ

గ్రంథములో 12 ప్రకరణములలో స్పష్టముగా వ్రాయబడి యున్నది. నిత్యప్రళయరూప సుషుప్తిలో వున్న మోస్తరుగానే జాగ్రత్స్వప్నములయందు జ్ఞానికి దేహావసాన పరియంతం లింగశరీరము లేనట్టువుండును. దేహావసానమందు లింగశరీరం భంగమై విదేహకైవల్యము సిద్ధించును. ఇదే మోక్షము అనగా విడుపు.



శ్రీ సద్గురు పరబ్రహ్మణే నమః.

# అహంగ్రాహిని.



## ద్వితీయ గ్రంథము.

## ఆనందము



ఆనందమే బ్రహ్మమని చెప్పబడుచున్నది. వేదశ్రుతి కూడా ఆనందమే బ్రహ్మమని చెప్పుచున్నది. శ్రీవిద్యారణ్య స్వాములవారు కూడా పంచదశి అను వేదాంతగ్రంథములో 1 యోగానందము 2 ఆత్మానందము 3 అద్వైతానందము 4 విద్యానందము 5 విషయానందము అని పంచ ఆనందములు చెప్పి ఆనందస్వరూపమైన బ్రహ్మమును ప్రతిపాదించినారు. వాసుదేవ మననము ఏకాదశ వర్ణకములో ఆత్మకు నిత్యనిరుపాధిక, నిరతిశయ, ఆనందము చెప్పబడియున్నది. వేదశ్రుతి స్మృతిపురాణాదులలో ఆత్మకు ఆనందము అంగీకరించబడియున్నది.

ఆనందము ఆత్మ లక్షణము. ఈ ఆనందము తాను ప్రకాశిస్తూ తన సమీపమున నున్న విషయములనుకూడా ఆనందస్వరూపములుగా కనుపర్చుచున్నందున చిల్లక్షణమున్నా యెడతెగకుండా యెల్లప్పుడు ప్రతిజీవికి ఆనందము స్ఫురింప

చేయుచున్నందున సల్లక్షణమున్నూ కలిగియున్నది. ఆనందము ప్రతిజీవియొక్క స్వరూపమైయున్నది. స్వరూప మగ్నతయందే ప్రతిజీవి ఉండుటకు ప్రతినిత్యము ప్రయత్నము చేయుచున్నదీ.

నిత్య సత్య నిరుపాధిక ఆనందమునందు ప్రతిజీవుడు ఓలలాడుటకు సుషుప్తి అవస్థను పొందుటకు కోరుచున్నాడు. ఆ సుషుప్తి అవస్థన పొందుటకు భార్యా ధనాదికమును వదలి తన స్థూలశరీరము నిరుపద్రవమగుచోట నున్నదా లేదా అను విచారణ లేక సూక్ష్మశరీర ముఖ్యమగుమనస్సును చేపట్టి మనోయుక్త సూక్ష్మశరీరమును కూడా వదలి అజ్ఞాన సన్నిధికి చేరి ఆనందమునందు ప్రతిజీవుడు మగ్నత నొందుచున్నాడు. ఇట్టి ఆనందము ప్రతిరోజు సుషుప్తి అవస్థలో మనకు గలుగుచునే యున్నది. అయితే అజ్ఞాన సన్నిధిని ఆనందములో మగ్నత పొందుచున్నామన్న సంగతి మనము మేలుకొనగానే సుషుప్తియందు జ్ఞప్తిలేని సుఖము పొందితిమని మనకు తోచుచునే ఉన్నది. స్వప్న సుషుప్తులయందు మనము ప్రతినిత్యము తిరుగుచునేయున్నాము.

జాగ్రదవస్థయందలి తెలివియే స్వప్నమందు స్వాధీనము లేనిదై స్థూలశరీరమునందలి ఆయా యింద్రియములకు స్థానములైన గోళములను వదలి ఇంద్రియ తన్మాత్రలతో మనోయుక్తముగా నిలిచినందున బాహ్యవ్యాపారము తప్పి బాహ్యమునందువలెసూక్ష్మశరీర మనోకల్పితములైన అయోని జంతుజాలమును స్వప్నమందు నిలిపిచూచి నిత్య సత్య నిరు

పాధిక ఆనందము సంభవించనందున మనస్సుతో కూడినసూక్ష్మ శరీరమును వదలి అజ్ఞానజన్యమైన కారణ శరీరమును పొంది నిత్యసత్య నిరుపాధిక ఆనందమును పొందుచున్నది. ఇట్టి ఆనందము పొందితినని గ్రహించుటకు, ఊహించుటకు అంతఃకరణ సుషుప్తియందు లేనందునను, అజ్ఞాన సన్నిధిని తాను ఉండుటనుబట్టిన్ని ఈమూడు అవస్థలలో వుండే తెలివి ఆనంద మిట్టిదని గ్రహించుటకు వీలుకలగడము లేదు. జాగ్రదవస్థలో స్థూలశరీరముద్వారా సర్వప్రపంచకమును స్వప్నావస్థయందు సూక్ష్మశరీరకలిత మనస్సుద్వారా అయోనిసంభవ సర్వప్రపంచకమును సుషుప్తిఅవస్థయందు సూక్ష్మశరీరముతో కూడిన మనోయుక్త అంతఃకరణమును వదలి నిత్యసత్య నిరుపాధిక ఆనందమును ప్రతినిత్యము మనలోని తెలివియే పొందుచున్నది. తెలివిని గురించి విచారించినయెడల బాగా ప్రతి సంగతి తెలియగలదు.

ఈతెలివియే ప్రతిజ్ఞానేంద్రియముతో కూడి ఆయాయింద్రియముల సంబంధమైన విషయములను యెరుగుచున్నది. ఈతెలివియే కర్మేంద్రియములతో చేరి ఆయాయింద్రియములకు యేర్పడివున్న కర్మలను చేయుచున్నది. విషయములను యెరుగునప్పుడు, కర్మలను చేయునప్పుడు యీతెలివి అహం పదార్థస్వరూపముతో అంతఃకరణతో చేరుచున్నది.

ఇట్లు అంతఃకరణతో కలిసి జ్ఞానేంద్రియములద్వారా విషయములను కనుక్కొను తెలివియే అహం అనే ప్రజ్ఞానము అయివున్నది. ఈ ప్రజ్ఞానమే త్వంపదార్థము అయిన

ఆత్మ. ఈఆత్మే బ్రహ్మము. ఇట్టి బ్రహ్మ స్వరూపమైన తెలివి అంతటను యేకరూపముతో నిండియున్నట్లున్నది. ఒక ఉపాధిలోనున్నది జీవుడుగాను సర్వోపాధులయందును ఉన్నది ఈశ్వరుడుగాను ఈ తెలివిచే మనము గుర్తించవలయును. అహామునుగురించి 17 ప్రకరణములోను ప్రజ్ఞానమునుగురించి 24 ప్రకరణములోను ఈ అహంగ్రాహిని ప్రథమగ్రంథములో వ్రాయబడియున్నది.

ఆనందముకు స్వరూపమే పరబ్రహ్మము. పరబ్రహ్మ సంబంధమైన ఆనందమునే మనము పొందవలయును గాని విషయానందములు పొందకూడదు. విషయానందములు జన్మ పరంపరలకు హేతువగుచున్నవి. బ్రహ్మానందము జన్మపరంపరలతోకూడి జన్మలకు హేతువైన విషయానందముకు శిథిలతకలుగ చేయును.

ఇట్టి ఆనందము బ్రహ్మస్వరూపమైయుండగా కొన్ని ఉపనిషత్తులలో అనగా అనంతోపనిషత్తులో

"భ్రాంతిమూలమిదంజ్ఞానం జ్ఞానంభ్రాంతేస్తు నిశ్చితం।
జ్ఞానాత్సంజాయతానందం ఆనందంభ్రాంతిలక్షణం" ॥

అని చెప్పబడియున్న యిట్టి యింకా యితర ఉదాహరణలను పట్టి ఆనందం భ్రాంతియొక్క స్వభావమని పలువురు అనుటయు సూటిమార్గ మవలంబించినవారు సహితము ఆనందస్వరూపుడైన పరమాత్మ దర్శనము లభించనందున అణువు లోని అణువును సహస్రారస్థితకళయందు తాము దర్శించి

నప్పటికి వేదబాహ్యమార్గులవలె పరమాత్మ స్వరూపము కూడా భ్రాంతిజన్యమేగాని నిజముకాదనుటయు కలుగు చున్నది. 'జ్ఞానపూర్ణానందగం బ్రహ్మ ఇత్యుక్తం మూఢమానవైః' అని కూడా అనంతోపనిషత్తునందు కలదు. మరియు "బ్రహ్మం డవ్యాపితం బ్రహ్మం, బ్రహ్మం సర్వత్ర వ్యాపితం। అంతర్బ హిశ్చతద్బ్రహ్మ. మన్యం నాస్తితినిశ్చయం। ఇతినిశ్చయతో విద్వాన్, అచలేవ నసంశయః। సద్రూపం నాస్తి సర్వత్ర చిద్రూపం నాస్తి సర్వదా। ఆనందరూపగమ్నాస్తి। అచలం నాస్తి సర్వదా। సర్వానంద విహీనశ్చ। అచలోయంసనాతః। ఆనందరహిత మచలం, కర్తృకార్యవివర్జితం। ద్వైతాద్వైత విహీనంచ ధర్మాధర్మా వివర్జితం। బంధాబంధాది రహితం అమృతంచాస్తి సర్వదా। సూక్ష్మాత్సూక్ష్మతరం నాస్తి మహతోమహితవర్జితః। అవేద్య, మనంగ, మబాధ్య, మభోధ్య, మలక్ష్య, మకర్మ, మప్రమేయ, మద్వయ. మని ష్క్రియ, పరమాకాశ, మచలం, సర్వదాభాతిపూర్ణం। నిష్కళం నిష్క్రియం పూర్ణం, నిరవద్యం నిరామయం, నిర్దే శ్యరహితం నిత్యం బ్రహ్మం బ్రహేతినిశ్చయం। మాత్రా త్పరంధ వేద్యస్తు, తత్పరం పరమశ్శివః। సర్వపరిపూర్ణగుమ్ సత్యం, శివాదన్యం నకించినా।"

'బ్రహ్మం సర్వగతం నిత్యం అచలం చావ్యయం, సదా। అంతఃపూర్ణోబహిపూర్ణః, పూర్ణకుంభయివార్ణవే। అంతర్బహిరపివ్యాప్తం, శివం సర్వగతంశ్శృణు। సర్వం బ్రహ్మ గతం నిత్యం జ్ఞానం నాస్థితినిశ్చితం। తదేవజాతమిత్యుక్త తదేవ

నశ్యతిశృణు। తస్యాపికారణం నాస్తి సత్యంసత్యం పునఃపునః। బాహ్యామభ్యంతరంనాస్తి సర్వంబాహ్యేతిః శ్చినా।నస్నానంనిచ ధర్మశ్చ నచకర్మనవర్తనం। బ్రహ్మ విష్ణ్వాదిదేవైశ్చ వందితః పరమశ్శివః। నిర్గుణం నిశ్చలం బాహ్యం సర్వకాలేషు సంస్థితం। జాగ్రత్స్వప్న సుషుప్త్యాది అవస్థా పంచకంనహి। షడూర్మిరహితోదేవః షడంగయిర్వ్యజ్జితశ్శివః। సర్వకాలే సదావ్యాప్తం సర్వదేశేషువ్యాపితం। నిష్కామం నిర్మలం శుద్ధ మచలంశబ్దవర్జితం। తేజోంధకారరాహిత్యం బాహ్య బ్రహ్మనసంశయః। సచ్చిదానందరూపత్వం మాయాఇత్యభిధీయ్యతే॥ జాతంనాస్తి మృతంనాస్తి నాస్తిజ్ఞానం కదాచన। ప్రపంచంనాస్తిసర్వత్రో నాస్తితత్కారణంసదా। పునఃపునః పరివక్ష్యామి సాక్షినాస్తితి నిశ్చయం। బాహ్యబ్రహేతి నిశ్చిత్య। ఇతివేదాంతడిండిమః। బహుధాతర్కవాదేన కిం ఫలంకింగమిష్యతి। అజ్ఞానవరకంసిద్ధం అన్యమార్గాను వర్తనం। శ్రవణ మనన నిధిధ్యాస, సమాధి భ్రాంతిలక్షణాం। బ్రహ్మవిశ్వం ద్వయంమిథ్య ఇతినిశ్చయమేవహి। శిష్యోర్నాస్తి గురుర్నాస్తి నాస్తిజ్ఞప్తిః కదాచన। ఏతద్వాక్య విభేదోయం గురువాక్యేనలభ్యతే। ఏతచ్ఛ్రవణమాత్రేణ విద్యావిద్యాచనశ్యతి। బ్రహ్మచారీ గృహస్థోవా వానప్రస్థో యతిస్తుహి! తేషాన్నవిద్య తేజన్మ ఇతివేదాంత జర్ఝరః। ఏమానవాః పఠిష్యంతి బాహ్యరూప భవంతిహి। నిరాకారం పరం బాహ్య మచలంపఠిష్యతే। అస్మిన్నర్థేనసందేహో సత్యం సత్యం పునఃపునః॥ అని అనంతోపనిషత్తు చెప్పుచున్నది.

ఈఅనంతోపనిషత్తులోని పైన కనుపర్చిన భాగము లలో బాహ్యం, అచలం పరమాకాశం, పూర్ణం, పరమ శ్శివః, శివం, బ్రహ్మ అను పదములను ఉపయోగించి సదరు పదములవల్ల పరమాత్మను గమ్యస్థానముగా చెప్పియున్నారు. దేహము, ప్రపంచకము, జీవుడు, దేవుడు, శిష్యుడు, గురువు మొదలయిన సర్వము అవిద్యమాయలవల్ల కలిగినవి గనుక మాయానిరసనము పూర్తిగా చేసి కేవలము పరమాత్మను మట్టుకే ప్రస్తాపించినారు.

పరమాత్మ సూచకముగా ఉపయోగించిన పదములు పర మాత్మసూచకములుగానే ఉన్నవిగానిల్లండ్లు భిన్నముగా లేవు. పరమాత్మలో క్షర, అక్షరములు మాయవల్లనే కలిగినవి. జ్ఞానులు మాయానిరసనము తమ స్థూలదేహపతనపర్యంతము చేయుచుండవలసిన విధియైయున్నది గాని మాయసంబంధ మైన కార్యములలో తగులుకొని విషయానందములలో పడ కూడదు. పరమాత్మ క్షరాక్షరస్వరూపములకు అధిష్టానమై ఈశ్వరస్వరూపముతో మాయను లోబరుచుకుని ఆడించుచు క్షరాక్షరఉపాధులకు మీరి పురుషోత్తమనామధేయముతో మూడులోకములను భరించుచున్నాడు. మాయారహితమైన పరమాత్మను చెప్పుటే ఉపనిషత్తుల విధియైయున్నది. 'అంత ర్బహిరపివ్యాప్తం శివం సర్వగతంశ్శృణు' అని పైనచెప్పిన అనంతోపనిషత్ వాక్యాలలోనె ఉన్నది. లోపల, బయట శివుడు అన్నిటియందు ఉన్నాడని అర్థమగుచున్నది.

బ్రహ్మ విశ్వం ద్వయం మిథ్య ఇతినిశ్చయమేనహి.
శిష్యోర్నాస్తి గురుర్నాస్తి నాస్తిజప్తి కదాచన
ఏతద్వాక్యవిభేదోయం గురువాక్యేనలభ్యతే
ఏతచ్ఛ్రవణమాత్రేన విద్యావిద్యాచనశ్యతి.

ఇట్టి వాక్యములు అన్ని పైన ఉదహరించిన ఉపనిషత్తులోని భాగములలో ఉదాహరించబడియున్నది.

బ్రహ్మ, విశ్వం రెండు మిథ్య. శిష్యుడూ లేడు గురువూ లేడు తెలివి అనేది లేనేలేదు. ఏవాక్యమువల్ల భేదము లేనట్లు కనుపించునో అట్టివాక్యము గురువువల్ల లభ్యమగును. అది విన్నందువల్ల జ్ఞానాజ్ఞానములు నశించును. ఇత్యాదివాక్యములు బాగావిచారించుకొని మనము గమ్యస్థానమైన ఉత్తమపురుషవాచ్యుడైన విరాట్పురుషుని పొందవలెను. గురువు శిష్యుడు యిద్దరు లేనప్పుడు "ఉపదేశఃకథంభవేత్" ఉపదేశమెట్లు కలుగును? ఉపదేశవాక్యమువినగానే విద్యావిద్యలు యెట్లు నశించును? ఇట్టి ఉపనిషత్తుల వాక్యములలో ప్రకృతి నిరసనయే ముఖ్యముగా గ్రహించతగియున్నది. గాని వేద బాహ్యమార్గము అనుసరించుటకు మార్గము యెంతమాత్రము గ్రాహ్యముకాదు. సూచించబడనూ లేదు.

విద్యానందమునుపట్టి విచారించు పండితులు వారికి ఇష్టమువచ్చినట్టు శబ్దవాక్యముల అర్థములయందు పెలలాడు చుందురు. అట్టి పాండిత్యముగాని, సంస్కృతజ్ఞానముగాని, సాధనచతుష్టయముగాని, గురుశుశ్రూషగాని యెంతమాత్రము

లేని అహంమజ్ఞులమనెడు వారము ఉపనిషత్తులలోని మాయా నిరసనపు వాక్యములను చదివి, మనకు ఉన్న మిణుగురుపుర్వు జ్ఞానముతో పూర్వాపరసంబంధము లేకుండా నాస్తిక అర్థము చేసుకుని క్షరాక్షరములకు మీరి ఉన్న ఉత్తమపురుషుని యందు భక్తి నిలుప నమ్మికలేక, భక్తి జ్ఞాన వైరాగ్యశూన్యులమై తత్వముక్తులను యీదేహములో ఉన్నప్పటికి మనము అనుభవించుచున్నామని సాహసించి చెప్పుచున్నాము. ఇది అంతా అవిద్యాలక్షణముగాని విద్యాలక్షణము కాదు.

'వ్యోమాంతరేచ ఆత్మాన, మాత్మమధ్యే నిరామయం
వ్యోమానమాత్మా కుర్వీత సమాధిస్తస్య లక్షణం'॥

*   *   *   *

"దృష్టింజ్ఞానమయీంకృత్వా తజ్జ్ఞానంచ విసృజ్యయా।
యత్ జ్ఞానంచ విశిష్యేత సర్వభ్రాంతి విహీనకం। తస్మాత్సర్వం పరిత్యజ్య పూర్ణమేవావశిష్యతే। చిదాకాశం మహాకాశం ఆకాశంచ ద్వితీయ్యకం। శూన్యంకృత్వా చిదాకాశం, మహాకాశమవాప్నుయాత్। భావాభావద్వయం త్యక్త్వా నిరాకార స్థితిర్భవేత్। త్యజేద్విద్యామవిద్యాంచ క్షరమక్షరకం సంత్యజ। బంధమోక్షద్వయంత్యక్త్వా యేనత్యజసితంత్యజ॥"

*   *   *   *

"జ్ఞానంనాస్తీతి నిశ్చయః విరామోయత్రచాస్తిచేత్ ।
దృష్టిస్సత్రైవ నిశ్చిత్య నిర్వికార స్థితిర్భవ। సర్వాంతస్థం శివం ధ్యాత్వా సర్వభావం విసర్జయేత్। జ్ఞానమంతర్బహిర్ధ్యాత్వా

జ్ఞాతృజ్ఞానం పరిత్యజ । షడ్భావరహితం పూర్ణం అష్టావరణ వర్జితం । షడ్వర్గరహితంపూర్ణం షట్కోశరహితం సదా । జ్ఞానంత్యక్త్వా జగత్త్యక్త్వా ఆత్మానం త్యజసంతతం । పురుషః ప్రకృతిర్నాస్తి ఏకంనాస్తి ద్వయంనహి। బాహ్యమభ్యంతరం నాస్తి। సత్యం సత్యమహర్నిశం ''

* * * *

భేదాభేద ద్వయంనాస్తి క్షరమక్షరగుంనచ। మాయా తత్కారణం నాస్తి సత్యంసత్యం పునఃపునః । గురుశిష్య ద్వయంనాస్తి ఉపదేశకథంభవేత్ । ద్వైతాద్వైతం సదా నాస్తి ద్వంద్వజాతంకథంభవేత్ । స్తుతిర్నిందా ద్వయంనాస్తి అహంకారః కథంభవేత్ । భూతంభవ్యం ద్వయంనాస్తి చిజ్జడత్వం కథంభవేత్ । దృక్ద్రష్టాచద్వయంనాస్తి నాస్తిజ్ఞప్తి కథంభవేత్ । కర్తృకారణ హీనోపి, జగత్సత్యం కథం భవేత్ । ఉపాధిద్వయుగుంనాస్తి జీవ బ్రహ్మకుతోభవేత్ కింబధ్నామిచ కింత్యక్త్వా కిం గృహ్ణామి కరోతికిం। కింశృణోమిచ కిందృష్ట్వా క్వగచ్ఛామికి మస్తిహి । బ్రహ్మణాభాసతం సర్వ బ్రహ్మమాయాద్వయంనహి । విద్యావిద్యా ద్వయం నాస్తి బంధమోక్షద్వయంనహి । శూన్యాశూన్య ద్వయం నాస్తి । పూర్ణాత్పూర్ణం తథానహి । పూర్ణశూన్యద్వయం నాస్తి యత్పూర్ణమచలం సదా । సర్వాధారం చిదాకాశం సర్వప్రాణి హృదిస్థితం । చిదాకాశే జగచ్చిత్రం చిదాకాశం సదానహి । కార్యకర్తృత్వగుంనాస్తి నాస్తిజ్ఞప్తి సదానహి। ఇతిజ్ఞేయ యద్భావం తద్భావం తత్పరిత్యజా । తూష్ణీమేవస్తి

తంతూష్ణీం తూష్ణీంభావన్నకించన । బహూన్ శబ్దాన్ ప్రవక్ష్యేణ వాగ్వ్యాపారం నిరర్థకం । ఏతత్సర్వార్థగుంసర్వం గురువాక్యేనబోధ్యతే । ఏతత్ శ్రవణమాత్రేనసర్వభ్రమవినశ్యతి । బ్రాహ్మణో క్షత్రియోవైశ్యో శూద్రచ్చండాల పుల్కసాః । తేషాం నవిద్యతేజన్మ ఇతివేదాంత నిశ్చితం । ఇతివేదాంత శిద్ధాంతం సారవేదాంత డిండిమః । మృత్యుజన్మద్వయంనాస్తి భయభ్రాంతి వినశ్యతి । ఏతత్ శ్రవణమాత్రేణ సర్వశిద్ధికరం భవేత్ ॥ పరమేవ్యోమం ప్రతితిష్ఠితః । యఏవం వేదప్రతితిష్ఠతి ॥

పైనవ్రాసిన శ్లోకములు సర్వసార పూర్ణోపనిషత్తులోనివి. ప్రకృతివల్ల కగిలినసృష్టి అంతా యీకనపడేసర్వము అయివున్నది. ప్రతివాళ్లు తమకువుండేనామామూలుచూపును జ్ఞానముతో కలిపి అజ్ఞానమును వదిలివేయగా సర్వభ్రాంతులు నశించును అనియు, వస్తురూపముగా కనపడే సర్వమును వదలి పెట్టగా పూర్ణమేయుండుననియు, జ్ఞానమునిరామను నొందిన చోట దృష్టిని నిశ్చయముగా నిలుపగానే నిర్వికారస్థితి కలుగుననియు, అన్నిభావములను వదలి అన్నిటియందు వున్న శివుని ధ్యానించవలయుననియు, ఇట్లు చేశినయడల ద్వయము నశించుననియు, అతిగా ప్రసంగించుట వాగ్వ్యాపారంగనుక నిరర్థకమనియు, ఇట్టి సర్వ అర్థములకు కీలికి అయిన పరమ వ్యోమము గురువాక్యమువల్ల కలిగి శ్రవణము చేసినంత మాత్రముననె సర్వ భ్రమలు నశించుననియు స్పష్టముగా కనపడుచున్నది.

పైదానినిపట్టిచూడగా పరబ్రహ్మతత్వమే చెప్పబడినది మనకు తత్వవిచారము ముఖ్యముగా చెప్పబడినది. తత్వ విచారణచేయలేనివాడు సాధనసామగ్రి అనగా 1. తత్వమును ఉపదేశించు గురువు 2. వేదాంతశాస్త్రము. 3. తత్వవిచారముకు అనుకూలమైన దేశకాలాదులు, ను, కలిగి వుండవలెననియు, నిరంతరము యేకాకారముగా ప్రవహించెడి వృత్తిరూపమే ఉపాసనఅనియు, సచ్చిదానంద నిత్య బుద్ధాది గ్రహింప తగిన గుణములు విధేయములు అవి ఆసచ్చిదానందాది గుణములను ధర్మిఅయిన పరబ్రహ్మముంకు నిషేధించుటే నిషేధ్యములు అని ఉపాస్యగుణములు రెండు విధములనియు, ఉపాసన మన యిచ్ఛకు లోబడియున్నదిగనుక ఉపాసన సర్వదా చేయవలసినదనియు, అజ్ఞాని, సర్వమును తెలిసిన జ్ఞాని, యీయిద్దరికి యేవిధి నిషేధములు లేవు అల్పజ్ఞనకే సర్వవిధులు కలవనియు శ్రీవిద్యారణ్య స్వాములవారు పంచదశి అను గ్రంథములో 9 ధ్యానదీపములో చెప్పియున్నారు. మనము కేవలము అజ్ఞాని అనిగాని లేక సర్వము తెలిసిన జ్ఞాని అనిగాని పిలువతగిలేము. అల్పజ్ఞులమేఅయివున్నాము. గనుక సర్వవిధులు మనకు ఉన్నవి.

కొన్ని ఉపనిషత్తులు పరబ్రహ్మ తత్వమునందు నిషేధ్య ఉపాసనచెప్పుచున్నవి. దృఢజ్ఞానము కలిగినవానికి ప్రపంచ వాసనే లేదు. వ్యాకులచిత్తము గలవారికి ధ్యానయోగము శ్రేష్ఠమనిన్ని, వ్యాకులచిత్తము, లేక, అజ్ఞానముచే ఆవరించబడిన మనస్సుగలవారికి సాంఖ్యతత్వవిచారణవల్ల అపరోక్ష

జ్ఞానము కలుగుననిన్ని పంచదశిలో ధ్యానదీపము 132, 133 శ్లోకములలోను సాంఖ్యధ్యానయోగములు రెండు ఒక్కటే అని తెలుసుకున్నవాడే యదార్థమును తెలిసినవాడు అని భగవద్గీతల అభిప్రాయమని 134 శ్లోకములోను చెప్పబడి యున్నది.

విధేయగుణఉపాసనవల్ల గమ్యస్థానమైన బ్రహ్మమే నిషేధ్యగుణఉపాసనవల్ల చెప్పబడినదియైయున్నది, గాని వేరే మరియొక బ్రహ్మము కాదు.

ఉ॥ సర్వఫలప్రదాతయును సర్వశరణ్యుడు సర్వశక్తుడున్
సర్వజగత్ప్రసిద్ధుడును సర్వగతుండగు చక్రపాణి యా
సర్వశరీరులున్ విగమసంగతిజెంది విశీర్యమాణులై
పర్విన చో నభంబుగతి బ్రహ్మముదాఁజెడకుండునెప్పుడున్.

(శ్రీఆంధ్రమహాభాగవతము, ద్వితీయస్కంధము పద్యము 210)

ఉ॥ కారణకార్యహేతువగు కంజదళాక్షునికంటె నన్యు లె
వ్వారును లేరు తండ్రి భగవంతు ననంతుని విశ్వభావనో
దారుని సద్గుణావళు లుదాత్తమతింగొనియాడకుండినం
జేరవు చిత్తముల్ ప్రకృతిజెందని నిర్గుణమైన బ్రహ్మమున్.

(శ్రీమదాంధ్రభాగవతము ద్వితీయస్కంధము పద్యము 211)

పైపద్యములనుపట్టి యీజగత్సృష్టి అంతా నశించినప్పుడు, ఆకాశము తన యందలి భూతములు పుట్టిగిట్టినను తాను మారకయున్నట్లు, విష్ణువు తాను నశించక బ్రహ్మమై యుండుననిన్ని, అట్టి కార్యకారణహేతువగు విష్ణుని సద్గుణులు

మహామతితో పొగడకుండిన వారి మనస్సులు ప్రకృతి రహితమైన బ్రహ్మమును చేరవనిన్ని స్పష్టముగా కనపడు చున్నది.

ఈతీరుగా అనేక గ్రంథములలో ప్రకృతిసహిత పర బ్రహ్మమే ప్రకృతిరహితపరబ్రహ్మమని దృష్టాంతపూర్వక ముగా వర్ణించబడియున్నది.

ప్రతిజీవియు తాను కొంతకాలము ప్రతిరోజును సుషుప్తి అవస్థలో నిత్య సత్య నిరుపాధికసుఖమును పొందుచున్నను ఆ ఆనందము జన్మరాహిత్యమునకు చాలదు. అది మామూ లుగా జీవకోటికి ఉండే సహజానందమే అయివున్నది గాని విశేషగుణము కలది కాదు.

ఇప్పుడు సుషుప్తిఅవస్థలో విషయ సుఖములుగాని విషయసుఖములను పొందే మనస్సుగాని లేనట్లు స్పష్టమగు చున్నది. ఆభాసజీవుడు అజ్ఞానసన్నిధిని సుషుప్తియందు ప్రత్య గాత్మయందు చేరి ఆనందమును పొందుచున్నాడు. స్వవశము కాని అనగా మనస్వాధీనములోలేని స్వప్నముద్వారా సుషు ప్తిలో అజ్ఞానసన్నిధియందు మనము ప్రతినిత్యము ప్రత్య గాత్మయందు ఆనందించుటకంటె జాగ్రదవస్థలో ఇంద్రియ లోలత్వము మాని మనస్సును మనము అంటక ప్రత్యగాత్మ యందు మనము అనగా మనజ్ఞానము కూడియున్నయెడల నిత్య సత్య నిరుపాధిక ఆనందమును పొందగలము. అట్టి ఆనంద మును పొందుట శ్రేష్టము. 'నేతి నేతీతి నేతీతి శేషితం పూర్ణ

ముచ్యతే అను ప్రమాణము కూడా జాగ్రదవస్థయందు అట్టి ఆనందమును పొందుటకే అయివున్నది. ఇంద్రియలోలత్వము మానుటకే పంచముద్రలు చెప్పబడినవి. పంచముద్రలవల్ల మనస్సు విషయాకారముగా ప్రవహించుట మానును. సూటి మార్గ మవలంబించినవారికి మనస్సు నిర్విషయమగుటయేగాక ప్రత్యగాత్మ స్వరూపము దర్శనమగును.

సకీలకముగా ప్రత్యగాత్మను దర్శించిన యెడల తన స్వరూపమయిన ప్రత్యగాత్మ శైవవైష్ణవ విభూతులతో దర్శన మిచ్చును. మరిదర్శించగా దర్శించగా శైవవైష్ణవ విశ్వరూప సందర్శనములు కలుగును.

శ్లో॥ ఉత్క్రామంతం స్థితంవాపి భుఞ్జానం వా గుణాన్వితమ్ ।
విమూఢా నానుపశ్యన్తి పశ్యన్తి జ్ఞానచక్షుషః ॥
శ్రీ భగవద్గీత ౧౫ అధ్యాయం ౧౦ శ్లోకం.

అను భగవద్గీతలలోని శ్లోకములో ప్రాణము పోవునప్పుడు దేహములో ఉన్నప్పుడు, గుణములతోచేరి విషయములను అనుభవించుచున్నప్పుడు అజ్ఞాని జీవుని చూడడము లేదు. జ్ఞాని చూచుచున్నాడు. అని చెప్పబడియున్నది.

భగవంతుని ఆకృతిఅయిన జీవుని దర్శించుటే జ్ఞానము. ఇట్టి జ్ఞానము రోజుకు రెండు యామములు రాజయోగ సంతతివారికి అభ్యాసములో ఉండవలెనని నియమమున్నది. ఈ నియమము ప్రకారము రెండుయామములు మనస్సును అంటక ప్రజ్ఞప్తియందు ప్రతినిత్యము తాను ఉండుటే ఆనందము. ఇట్టి

ప్రజ్ఞప్తి సహస్రారస్థిత అణుమాత్ర మహాకళలోని నిష్కళ అయివున్నది. నిష్కళే సవ్యాపసవ్య చూపులకు శివకేశ వులై వెలశినది. తాను విషయేంద్రియ జ్ఞానము లేక నిష్కళయందు శివకేశవులను దర్శించుటే ఆనందము. శివ కేశవ స్వరూపానందము ద్వాయ సంబంధమైన భయములను పారదోలి అద్వయానందమే అగుచున్నది. ఇట్టి ఆనందమే స్వప్నమందు కలలురాకుండునట్లు చేయడమేగాక స్వప్నా వస్థయందలి స్వాధీనములేని మనస్సంచారమును ఆపును.

నిత్యసత్య నిరుపాధిక ఆనందమును మనము మనజాగ్ర దవస్థలోనే ప్రతినిత్యము రెండుయామములు పొందవల యును.

ఈ ఆనందమును పొందుమార్గమును గ్రహించుటకే యీ అహంగ్రాహిని ప్రథమ గ్రంథమున్నూ యింకాయిట్టి ముఖ్యాంశములున్నూ వ్రాయబడినవి. వ్రాయబడుచున్నవి.

విదేహికైవల్యము శైవవైష్ణవ విభూతులతో ఉన్నది. యే ప్రకరణములో యేతీరుగా చెప్పినను దృగ్బ్రయ బ్రహ్మ మును మనము దర్శించి అందలి శివకేశవుల దర్శించి నిత్య సత్య నిరుపాధిక సుఖమును పొందుటకే యింత విరళముగా వ్రాయుట కలుగుచున్నది. శ్రీసీతారాముల ఉపదేశమును సాంతముగా విన్న ఆంజనేయులు,

"శ్లో॥ దేహబుద్ధ్యాస్మి దాసోహం జీవబుద్ధ్యాత్వదంశకః ।
ఆత్మబుధ్యాత్వమేవాహ మితిమే నిశ్చితామతిః ॥"

అనగా శరీరమే నేనను తలపుచేత నీకు సేవకుడను. జనన మరణ సహితమైన జీవుడే నేనను తలపుచేత నీయంశ గలవాడను. పరబ్రహ్మమే నేననెడు బుద్ధిచేత నీవేనేను.

అయితిని అని ఆఖరుకు జవాబుచెప్పి శలవు పుచ్చుకొని నిజాశ్రమమునకు వెళ్ళి శ్రీరామచరణ కమల భక్తియుక్తుండును శ్రీరామనామ జప పరాయణుండును శ్రీరామ బ్రహ్మతత్వావలోకన నిరతిశయ నిర్వికల్పసమాధి నిష్ఠుండునై జీవన్ముక్తి సుఖం బనుభవించుచున్నాడని శ్రీసీతారామాంజనేయ సంవాదములో చెప్పబడియున్నది. త్రిమూర్త్యాత్మకుడు పావన మూర్తిఅయిన జీవన్ముక్తునికికూడా భగవత్పాదారవింద భక్తి నామ జపపరాయణత్వము బ్రహ్మ తత్వావలోకన నిరతిశయ నిర్వికల్ప సమాధి, నిష్ఠ, అవసరమైయున్నట్టు కనపడుచున్నది. గాని నియమరహితమైన చర్య చెప్పబడియుండలేదు. పెద్దల దారిని మనము నడవవలయునుగాని నిషేధ్యఉపాసన గుణములను చెప్పే వాక్యములను మట్టుకు తీసుకుని శూన్యవాదులమై వేదబాహ్య మార్గావలంబకులము కాకూడదు. విధేయగుణ ఉపాసనవల్లనే మనము పొందతగినబ్రహ్మపదము ప్రాప్తించుచుండగా నిషేధ్యగుణ ఉపాసనను మనము అందుకు అర్హత లేకనే చేయుట మంచిగా కనుపించదు. మీదు మిక్కిలి చెడుగుక్రిందికే వచ్చుచున్నది.

ఎట్లాగనగా కులాచారనియమములు లేక తత్వజిజ్ఞాస యెంతమాత్రము చేయక, జిహ్వోపస్థల నేమాత్రము కట్టు

బాటులో ఉంచక దురాచారములతో నడచుచుండెడి యిట్టి కలికాలములో భగవంతునియొక్క నామస్మరణమే ముక్తికి కారణముగా చెప్పబడినది.

భగవంతు డన్నను, స్మరణ అన్నను, దురాచారములను తొలగించుటన్నను, జిహ్వోపస్థలకట్టుబాటన్నను తత్వజిజ్ఞాసలన్నను, కులాచారమన్నను ఇప్పటి వారికి చాలా కష్టతరముగా ఉన్నది. భక్తిజ్ఞానవైరాగ్యములు అసలే లేవు.

శ్లో॥ ఆదౌసగుణమాశ్రిత్య నిర్గుణంచ తతఃపరం, ఆదౌ
నిర్గుణమాశ్రిత్య భిన్నభాండోదకం యథా॥

అని యీఅహంగ్రాహిని ప్రథమగ్రంథములో 6 ప్రకరణములో సగుణ నిర్గుణము లను హెడ్డు క్రింద ఉదాహరించబడియున్నది. ఒక యిల్లును కట్టుటలో చాలా ప్రయాస కలదు. కట్టిన యిల్లును పడగొట్టుటలో తక్కువ ప్రయాసమే కలదు. రెండున్నూ ప్రయాసములే. అయితే కట్టుటకంటె పడగొట్టుట తేలికయేగాని విధికివ్యతిరేకమైయున్నది. సచ్చిదానంద నిత్యనిర్మలత్వములు ఆత్మకు యెల్లప్పుడు స్వరూప స్వభావికములే అయివున్నవి. ఈపంచలక్షణములు ఆత్మయందు సృష్టి ఉన్నప్పుడు జీవదృష్టికి గోచరమగుచున్నవి. జ్ఞానులు విధేయగుణఉపాసనవల్లనే పంచలక్షణములు గల ఆత్మను వర్ణించినారు. జీవత్వము సృష్టికి సంబంధించినందున ఆత్మకు గ్రాహ్యములైన పంచ లక్షణములున్నూ జీవదృష్టికి కనపడే సర్వమున్నూ మాయాకల్పితమైన జీవునిచేత దర్శిం

చబడి, విమర్శింపబడి, ఉద్దేశించబడుచున్నందున మాయను జీవత్వమును నిరసించుటకు నిషేధ్యగుణఉపాసన శాస్త్రమందు జ్ఞానులే చెప్పినారు. సాధారణముగా నిషేధ్యగుణ ఉపాసనయున్నూ చాలా ప్రశస్తమైనదే. విధేయగుణఉపాసన వల్ల చెప్పబడిన పరమాత్మయే నిషేధ్యగుణఉపాసవల్లను కూడా సూచించబడినది. విధేయగుణఉపాసకుడే దానిని పొందుటకు అర్హుడు.

నిరంతరము యేకాకారముగా ప్రవహించెడి వృత్తి రూపమే ఉపాసన అయివున్నది. ఉపాసనయొక్క విధేయ, నిషేధ్యము లనెడి గుణములను మాట్లకే మనము విచారించు చున్నాము గాని, ఉపాసన యెంతమాత్రమును ఆచరించుట లేదు. ఉపాసన కలవారు యితరసంగతులు విచారించుటగాని వినుటగాని తటస్థించదు. అట్లు తటస్థించినను వారు చర్చల యందు జోక్యము కలుగచేసుకున్నయెడల వారి ఉపాసనకు భంగము కలుగుచున్నది. నిషేధ్యగుణములవల్ల చెప్పబడిన ఉపాసనలో "సర్వకాలసర్వావస్థా సుఅహంపదార్థరహితనిష్ఠో భవ" అనగా సర్వకాలసర్వావస్థలయందు అహంపదార్థము లేని నిష్టలో ఉండమని విధించబడియున్నది. నేననే భావము లేనప్పుడు 'అట్టి నిష్టలో ఉండువారు ఎవరు? ఎట్టివారు? రూపమెయ్యది' అని మనము విచారించుటకు ప్రశ్నించుటకు అర్హులము కామా? విధేయగుణఉపాసనవల్ల మనము భగవంతుని దర్శించినను, జీవత్వ గుణములు యింకా మనను బాధించునేమో నను సంశయము కలిగి మాయతోను,

అవిద్యతోను కూడిన గుణములను పూర్తిగా త్యజించుటకు నిషేధ్యగుణఉపాసన చెప్పబడినదని మనము నమ్మవలశినదే గాని తుంపుతుపాకిని మెగరకొట్టే కొన్ని నిషేధ్యగుణవిచారణలోని వాక్యములను పూర్వాపరసంబంధము లేకుండా తీసుకుని వేదబాహ్యమార్గము మోస్తరుగా మనము ప్రసంగించ కూడదు.

జాగ్రత్తులోనే నిత్యసత్య నిరుపాధిక సుఖమునుమనము పొందుటకు జ్ఞానేంద్రియములను కర్మేంద్రియములను మనస్సు యేమాత్రము చేరకుండవలయును. అట్లా మనసు యింద్రియ విషయములమీదికి పోకుండ నిలచుటకు మనలో అహం రూపేణ ఉండు తెలివి ప్రజ్ఞానముకావలెను. ప్రజ్ఞానమును గుర్తించి యీఅహంగ్రాహిని ప్రథమగ్రంథము 24 ప్రకరణము చదివిన తెలియగలదు. అట్టి ప్రజ్ఞానము సదరు గ్రంథములో 25 ప్రకరణములో వివరించిన సమాహితచిత్తము వల్లనే కలుగును.

అసాధారణమైనట్టియు మహత్తరమైనట్టియు వస్తు దర్శనమువల్లనే, ప్రజ్ఞప్తి యింద్రియ విషయములతో చేరెడి మనస్సుతో చేరకయుండును గాని వేరు సాధనము లేదు. అట్టి అసాధారణ మహత్తు వస్తువ లింగశరీర భాగములలో దేని వల్లను తాను యిదివరకు దర్శించనిది అయివుండవలెను. అట్టి అసాధారణమహత్తు జీవకోటికి యావత్తు స్వరూపమై, మహాత్తులకు మహత్తై, సూర్యాది మహత్తర జ్యోతిర్గణము

లకు తేజస్సును కలుగజేయునదియై, సాకార నిరాకార స్వరూపములకు మీరిన నిరాకార తత్వస్వరూపమైయున్నది.

" సచ్చిదానందమాత్మాన మద్వితీయం బ్రహ్మభావయే దాత్మానం సచ్చిదానందం బ్రహ్మభావయే దిత్యుపనిషత్ "

అని వజ్రసూచికోపనిషత్తునందు చెప్పబడినది.

" అచలం నిర్మలం శాంతం కాయస్థం తేజఉచ్యతే
అమలం నిర్మలం దేహం శూన్యంయాతి నిరంజనం
తజ్జ్యోతివిమలేస్థానే జ్ఞేయం ప్రత్యక్షగోచరం" అని
" ఆత్మజ్యోతి ప్రకాశేన సోమసూర్యాగ్నిభాసతే " అని
"చిదాత్మా సర్వదేహేషు వ్యాప్యతే జ్యోతిరూపకం
తజ్జ్యోతి చక్షురగ్రేచ గురునేత్రంచపశ్యతి " అని

పద్మపురాణమునందలి రాజరాజేశ్వరీ యోగములోను అక్ష్యుపనిషత్తులోను చెప్పబడియున్నది.

నారాయణోపనిషత్ లోని మంత్రపుష్పములోను

11 " నీలతోయదమధ్యస్థాద్విద్యుల్లేఖేవ భాస్వరాట్
నీవారశూకవత్తన్వీపీతా భాస్వత్యణూపమా

12 తస్యాశ్శిఖాయామధ్యేపరమాత్మావ్యవస్థితః
సబ్రహ్మసశివస్సహరిస్సేంద్రస్సోక్షరః పరమస్స్వరాట్

27 త్వంతదాపఆపోజ్యోతీరసోమృతంబ్రహ్మభూర్భువస్సువరోం అని యున్నది.

ఈవాక్యములు అన్ని గురుసూచన కానివారికి బట్ట బయలుగా కనపడ నేరవు. ఇట్టి ఉపనిషద్వాక్యములవల్ల ఆత్మకు సచ్చిదానందాది పంచలక్షణములు అంగీకరించబడడమే గాక ఆత్మస్వరూప నిర్ణయమున్నూ దర్శనమున్నూ అంగీకరించ బడినది.

విధినామము లనగా

అంతటికి పెద్దవాడుగనుక బ్రహ్మయని పేరు. సర్వ వ్యాపకుడు గనుక విష్ణువని పేరు. సూర్యచంద్రాగ్ని కాంతు లకు మీరిన కాంతిగలవాడు గనుక శివుడని పేరు. సర్వ స్వరూపుడుగనుక ఓంకారస్వరూపుడు. ఇవి మొదలైన అనేక విధినామములు యీయనకు కలవు.

నిషేధనామము లనగా

పుట్టుకలేని వాడు గనుక అజుడనియు, చావనివాడు గనుక అనంతుడనియు, ఇవి మొదలైనవి ఒకదానిని నిషేధించి నిలిచిన వస్తువను వేదము చెప్పుచున్నది.

అని సంఖ్యార్థనామప్రకాశికలో ఉన్నది.

సూర్యునియందలి స్వరూపాగ్ని సూర్యకాంతపురాతిలో బడి వృత్తిరూపఅగ్నియై దహించునట్లు పరమాత్మ యందలి స్వరూపజ్ఞానము వృత్తిజ్ఞానమై అవిద్యను నాశనము చేయును. పరమాత్మయందు స్వరూపజ్ఞానము యెప్పుడును ఉండునని స్పష్టమగుచున్నది.

నిత్య సత్య నిరుపాధిక ఆనందము పరబ్రహ్మ స్వరూపమైనట్లు పైనకనుపర్చిన దానినిపట్టి స్పష్టముగా కనపడుచున్నది. విషేధ్యగుణ ఉపాసన ప్రతిపాదకిములైన కొన్ని ఉపనిషద్వాక్యములను పూర్వాపర సంబంధము లేకుండా తీసుకుని పరమాత్మ శూన్యమని వాదించే వేదబాహ్య మార్గమును మనము యెంతమాత్రమును విశ్వశించకూడదు.

ఆనంద స్వరూపుడైన పరమాత్మయే జీవేశ్వరులై యున్నాడు. అణువులో అణువైనజీవాత్మ మహత్తులో మహత్తైన పరమాత్మ వాచ్య యీశ్వరుడే అయివున్నాడు.

అణువులో అణువైన జీవాత్మ ప్రత్యగాత్మయే అయివున్నాడు. ప్రత్యగాత్మ శివకేశవ స్వరూపుడై యున్నట్లు మనము మనలోని సహస్రారస్థిత కళయందు కనుగొనవలెను. ప్రత్యగాత్మ శివకేశవస్వరూపుడైన పరమాత్మయై యుండుటే ఆనందము.

అతద్వ్యావృత్తి లక్షణము, తటస్థలక్షణము, స్వరూపలక్షణము, భగవంతుని కనుగొనుటకు చెప్పబడినవి. అతద్వ్యావృత్తి లక్షణము నేతి నేతీతి నేతీతి శేషితం పూర్ణముచ్యతే అని చెప్పిన ఉపనిషద్వాక్యమును పట్టి పరమాత్ముడైన భగవంతుని కనపర్చుచున్నది. తటస్థలక్షణము ఒక

మూర్తిని ఉపాసించగా పిమ్మట సర్వాంతరవర్తియైన పరమాత్మను కనుగొని ఆమూర్తిని విడుచునది. శాఖాచంద్రవత్ ప్రమాణములవల్ల పరమాత్మను కనపర్చుచున్నది. ఆఖరుది అయిన స్వరూపలక్షణము సత్యంజ్ఞాన మనంతం బ్రహ్మమనెడి శృతినిపట్టి సచ్చిదానందమే పరబ్రహ్మమని చెప్పుచున్నది.

గనుక ఆనందము బ్రహ్మమైయున్నది.



శ్రీ సద్గురు పరబ్రహ్మణే నమః.

# అహంగ్రాహిని.

ద్వితీయ గ్రంథము.

## దర్శనము.

ఆదిత్యహృదయములో 'ఏష బ్రహ్మాచ విష్ణుశ్చ, శివ స్స్కంధః ప్రజాపతిః' అనియు "ఏష సుప్తేషుజాగర్తి భూతేషు పరినిష్ఠితః ఏష ఏవాగ్ని హోత్రంచ ఫలంచైవాగ్ని హోత్రిణాం' అనియు ఇట్లు ప్రయోగించినారు. ఏషశబ్దమునకు సూర్యునియందు ఏహిరణ్మయపురుషుడు చూడబడుచున్నాడో అట్టి హిరణ్మయపురుషుడు అని అర్థము. 'యఏషోంతరాదిత్యే హిరణ్మయః పురుషోదృశ్యతే' అని శ్రుతి చెప్పుచున్నది. ఏతశ్శబ్దముచేత పురోవర్తి వాచకము నిర్దేశము చేయబడినది.

ఖగః = ఖేగచ్ఛతి. అనగా ఆకాశమున తిరుగువాడు.

ఖగః = ఖంగచ్ఛతి. అనగా దహరాకాశమును పొందినవాడు. అనగా ఉపాసకులచేత దహరాకాశమున చూడబడువాడు.

సువర్ణసదృశః = బంగారముతో సమానుడు అనగా 'హిరణ్యశ్మశ్రుర్హిరణ్యకేశ ఆప్రణఖాత్సర్వ ఏవసువర్ణః' బంగారు మీసములు బంగారు వెండ్రుకలు గలవాడు. గోళ్లు సహా సమస్త శరీరము బంగారు మయము అనగా సువర్ణము.

హిరణ్యరేతాః = బంగారు వికారమైన రేతస్సుగలవాడు. కార్యరూపమైన హిరణ్యమయ బ్రహ్మాండమును సృజించినవాడు గనుక కారణరూపమైన ఆయన రేతస్సు బంగారు వికారమైనది.

భగవంతుని స్వరూపవిమర్శనను గురించి ఇత్యాది పదప్రమాణములు ఆదిత్యహృదయమునుపట్టి కనపడుచున్నవి.

శ్లో॥ సౌరమండలమధ్యస్థం సాంబంసంసారభేషజం ।
నీలగ్రీవం విరూపాక్షం బ్రహ్మేతి పరిచింతయ ॥

అని శంకర విజయధ్వజములో చతుర్దశ జయ పర్వములో 163 పేజీలో ఉన్నది.

శ్లో॥ తారాకారవిమానమధ్యనిలయం తత్వత్రయారాధితం ।
తత్రాధీశ్వర యోగనిర్గుణమహా సిద్ధైస్సమారాధితం ।
తత్సంగం తరుణేందుశేఖర సఖంతారాంత్రయాంతర్గతం।
తప్తస్వర్ణకిరీట కుండలయుగం రామంభజేతారకం ॥

శ్రీరామ కర్ణామృతము. ఆ ౨ శ్లో. 3౫.

శ్లో॥ ఏకాంతే కమలేజలేజలేవికసితే చంద్రీకృతస్థాపితే।
స్థానే తారకమంటపే తనుబిల వ్యాప్తేసుధామంటపే।
అబ్జార్కానలమండలే పరమహా శ్రీషోడశాంతేసదా।
నాదాంతేజనకాత్మజాన్వితమహాం రామంభజే తారకం॥

శ్రీరామ కర్ణామృతము ఆ. ౨ శ్లో ౭౮.

శ్లో॥ ధ్యాయేత్వాం రవిమండలేందు ధవళేపద్మేనిషణ్ణంహరిం।
స్వర్ణాభంకరశంఖచక్రలలితం పీతాంబరం కౌస్తుభం।
స్వర్ణశ్మశ్రునఖాలకం లలనయాయుక్తం కిరీటాంగదం।
హారాలంకృతవక్షసంపదయుగం శ్రీపాదుకాలంకృతం॥

శ్రీరామకర్ణామృతము ఆ. ౨ ౮౦

శ్లో॥ చిదంశం సమానందకందం
సుషుమ్నాఖ్యరంధ్రాంతరాగంచహంసం
సచక్రం సశంఖం సపీతాంబరాంకం
పరంచాన్యదైవం నజానే నజానే॥

శ్రీరామకర్ణామృతము ఆ ౨ శ్లో ౮౯

శ్లో॥ వైకుంఠే పుటభేదనే మణిమయప్రాంతేందు సింహాసనే।
అష్టాంతాంతసరోరుహేశశిగళత్పీయూషవార్యంతరే।
చంద్రార్కానలభానుమండలయుతే శేషాహితల్పాంతరే।
వాసంవాసవనీలకోమలనిభం రామం భజే తారకం॥

శ్రీరామకర్ణామృతము ఆ ౨ శ్లో ౧౦౦

శ్లో॥ సహస్రపత్రాంబుజకర్ణికాంత
జ్యోతిఃప్రకాశం పరమాదిమూలం

తేజోమయం జన్మ జరా విహీనం
శ్రీ రాఘవం నిత్యమహం నమామి॥

శ్రీరామకర్ణామృతము అ ౨ శ్లో ౧౦౪

శ్లో॥ అచింత మవ్యక్త మనంతరూపం
అద్వైతమానందమనాదిగమ్యం
పుణ్యస్వరూపం పురుషోత్తమాఖ్యం
రామం భజే రాఘవరామచంద్రం॥

శ్రీరామకర్ణామృతము అ 3 శ్లో ౪౪

ఇట్లు శ్రీరామకర్ణామృతములో పైశ్లోకములలోను యింకా కొన్ని శ్లోకములలోను ఉన్నది.

శైవవైష్ణవవిభూతులు శివకేశవస్వరూపములు సహస్రారస్థిత సుషుమ్నకళయందే శ్రీజగద్గురువు ఆదిశంకరులవారు వర్ణించియున్నారు.

క. శారీరస్థితికి బ్రథమకారణమైయుండు నాడికాదశకము సంచారికలగు నింద్రియముల కారయ నాడికలు మఱియు నైదమలమతీ. 302.

తే. స్థూలభంగులు పదియును సూక్ష్మభంగు
లైదునివివీనికంటె నత్యంత సూక్ష్మ
భంగిహృదయంబు నడుముగా బరగియున్న
నాడియది సర్వగతయగు జూడజూడ 303

క. ఆమూపుమరగిచిత్తం, బేచవికింబోటుపోయెనేనిమరలుపన్
గోచరమగువెలిచవులం, బాచినలోచవిననిలిచిపరమాత్మ
గనుఁ. 304

శ్రీమదాంధ్ర మహాభారతము, శాంతిపర్వము, చతుర్థాశ్వాసము.

ఈశాంతిపర్వములోనే యింకా కొన్నిచోట్ల భగవంతుని దర్శనము అంగీకరించి చెప్పబడియున్నది.

శ్లో॥ ధ్యేయస్సదాసవితృ మండలమధ్యవర్తీ
నారాయణ స్సరసిజాసన సన్నివిష్టః।
కేయూరవాన్మకరకుండలవాన్కిరీటీ
హారీహిరణ్మయ వపుర్ధృత శంఖచక్రః॥

అని సూర్యోపస్థానములో చెప్పబడియున్నది.

దర్శనము.

ఇత్యాది ప్రమాణములవల్ల నిర్వికారస్థితిలో త్రిపాద్విభూతితో ఉన్న నిర్గుణపరబ్రహ్మమే ఏకపాదవిభూతి అయిన ప్రకృతితో కలిసియున్న విరాట్పురుషుడుగా వర్ణించబడుచున్నాడు. ఏకపాదవిభూతితోవున్న ప్రపంచకము ప్రకృతి అంతా మాయామయముగనుక విరాట్పురుషుడున్నూ మాయే అని చెప్పకూడదు.

కైవల్యనవనీతము తత్త్వబోధప్రకరణములో 16 పద్యముయొక్క అర్థతాత్పర్యములలో యీవిరాట్పురుషుని సంగతి బాగా విశదీకరించబడియున్నది, లోకములయందు విశేషముగా ప్రకాశించువాడు గనుక విరాట్పురుషుడు అను పేరు

వచ్చినది. వైరాజసుడు, వైశ్వానరుడు అను పేళ్ళుకూడా యీ విరాట్పురుషునికే వాడుకలో ఉన్నవి. ఇట్టి విరాట్పురుషుడు సృష్టిస్థితిలయములకు అధికారియైయున్నాడు. ఈఅహంగ్రాహిని ప్రథమ గ్రంథము. 15 ప్రకరణములో ఈసంగతి విపులముగా వ్రాయడమైనది.

ఇప్పుడు మనకు సంబంధించినది దర్శనము. ఆయా గ్రంథములలో దర్శనమును గురించి ఉన్న పద్యములు వగైరాలు కొన్నిటిని పైన తెలియపర్చినాను. అట్టి గ్రంథముల లోని సంగతులకంటె నేను చెప్పునది మరేమియు లేదు. అక్కడక్కడ దర్శనమును గురించి వ్రాసిన సంగతులను ఒక చోట కనపర్చుటే నావిధియైయున్నది. అట్టి దర్శనమును పట్టి వ్రాయు యీసంగతులను విరాడ్రూపునివ్యష్టిహంశభూతులయిన మీఅందరి యెదట విమర్శన నిమిత్తం పెట్టడమైనది. దర్శనము అనగా చూచుట. మనమందరమునూ చూచుచునే ఉన్నాము. ఎవరిని చూచుచున్నాము? మనమందరము మనకు అధిష్టానమైన విరాడ్రూపుని స్వరూపము నెచూచుచున్నాము. అయితే మన యందలి అజ్ఞానమువల్ల మనము విరాడ్రూపుని చూచుచున్నట్టు గోచరించుటలేదు. అజ్ఞానము అనగా అవిద్య. విద్య అనగా జ్ఞానము. జ్ఞానమును అజ్ఞానము కమ్ముకొని ఉన్నది. విద్యను అవిద్య కమ్ముకొని ఉన్నది. విద్యవల్ల జ్ఞానము కలిగి అవిద్య అనెడి అజ్ఞానము నశించువరకు మనము అవిద్యకు లోబడియుండుట సహజమేను. లోకసంబంధమైన విద్య

లవల్ల అవిద్య నశించనేరదు. బ్రహ్మవిద్యవల్లనె అవిద్య నశించును

మనము చూచునది అంతా మనచుట్టూవుంటే ప్రపంచకము అయివున్నది. ఆప్రపంచకములో నివస్తు సముదాయములు సాధారణముగా అన్నిమార్పుచెందుట ప్రతిరోజు తెల్లవారుట ప్రొద్దుకూకుట జనులలో కొంతమంది చనిపోవుట నూతనముగా పుట్టుట చూచుచున్నాము. మన చూపులోనే కాలము గతించిపోవుచున్నది

శ్లో॥ దినయామిన్యౌ సాయంప్రాతః శ్శిశిరవసన్తౌ పునరాయాతః కాలః క్రీడతి గచ్ఛత్యాయుః స్తదపినముంచః త్యాశావాయుః.

పగలురాత్రులు ఉదయాస్తమానములు వసంతాది ఋతువులతో కాలం ఆటలాడి పోవుచున్నది. ఆయువు క్షీణించుచున్నది ఆశాపాశములుమట్టుకు తగ్గడములేదు అని భజగోవింద శ్లోకములలో చెప్పినారు. ప్రపంచకము లోని సృష్టి అంతా కాలమందు లయమువుచున్నది. అట్టి కాలము లయమవుటను మనము యెల్లప్పుడు చూచుచున్నాము. మనము యెల్లప్పుడునూ కాలమునకు లోబడకుండానే కాలము గడచిపోవుటను చూచుచున్నాము. అయితే మనము యెవ్వరమోమనము విచారించియుండనందున మనకు సుఖము కనపడడములేదు. సాయంత్రము సూర్యకిరణములకు మేఘములు యెర్రపడినట్లు అనగా సూర్యుని యెర్రటి

కాంతి మేఘములయందు ప్రతిఫలించి మేఘములు యెర్రబారినట్లు పరమానంద సుఖస్వరూపుడైన విరాట్పురుషుని పాంశలమైన మనవీక్షణచేతనే అన్యత జడ దుఃఖాత్మకమైన విషయములు మనకు సుఖములుగా కన్పట్టుచున్నవి. మనము అత్యంత ఆకలిబాధతో వున్నప్పుడు తమాషాలు చిత్రములు మనకు రుచించనట్లు మనకు స్వస్వరూప దర్శన కుతూహలులమైన యెడల మనకు విషయసుఖములు రుచింపవు "ఈ చూచువాడను ఎవరను? యేతీరుగావున్నను? నాకు అన్యముగా తోచెడి దేహ ప్రపంచకములు నేనుకాను" అని నిశ్చయము కలిగి విషయానసక్తుడుగాక స్వస్వరూప దర్శనమందు యిచ్ఛ కలిగిన యెడల సాధనచతుష్టయ సంపన్నుడగుచున్నాడు. అంతటనూ నిండివున్నది విరాట్పురుషుడేగనుక సాధనచతుష్టయ సంపన్నునకు ఆయన గురురూపేణ సాక్షాత్కరించి స్వస్వరూప దర్శనము యిచ్చుచున్నాడు.

అట్టి స్వస్వరూప దర్శనము కలిగినతరువాత తాను చూచునది అంతా విరాట్పురుషుని ఆకృతిగానే కనుపించును. విరాడ్రూపుని అవతారములు అన్ని పరిశ్రమ చేయువారికి తప్పక కనుపించును. తన స్వరూపము తాను చూచుటకు వేరే సాధనలు అవసరములేదు. పైనచెప్పిన మోస్తరుగా వస్తురూపేణ కనపడునది అంతా కాలమందు లయమగుచున్నది. అట్టికాలము మనచూపునందు లయమగుచున్నది. చూపు మనయందు లయమగుచున్నది. తెలుపు మృదుత్వము మధురముగలిగిన వస్తువు చక్కెర అయివున్నది. ఆతీరుననె

దృశ్యము, కాలము, చూపు అంతా విరాట్పురుషుడే అయి వున్నాడు. ఆవిరాట్పురుషుడు వ్యష్టిని జీవుడుగాను సమిష్టిని యీశ్వరుడుగాను ఉన్నాడు. చూపును దర్శించినవారికి విరాడ్రూపుడే కనపడవలయును. విరాడ్రూపుడే విరాట్పురుషుడైన పరమాత్మ. నేలనువదలి మనము సాము చేయలే నట్లు విరాడ్రూపుని వదలి మనము చేయు విచారణ అంతయూ వృధా ప్రయాసమగును. ఆ విరాడ్రూపుని వ్యష్టిహింశభూతులమే మనము గనుక చూపు విరాట్పురుషుని వ్యష్టి ఆకృతులమైన మనయందే లయమగుచున్నది. ఈకీలు బాగా తెలుసుకొని జీవత్వ భ్రాంతివదలి మనము విరాట్పురుషుని స్వరూపమే కావలయును. విరాట్పురుషుని స్వరూపము మనము పుష్టిగా అయ్యేవరకు ఆయన స్వరూపదర్శనమందే ప్రారబ్ధ సంబంధమైన మనస్థూలదేహము నశించేవరకు మన తెలివితేటలను ఉపయోగించవలెను. దర్శనమందే తదేక నిష్ట కలిగి యుండవలయును. యెక్కడ యెప్పుడు చూచిననూ ఆయన స్వరూపదర్శనమే కావలయును.

"చిదాత్మా సర్వదేహేషు వ్యాపితం జ్యోతిరూపకం"

అని వున్నది గనుక జ్యోతిస్వరూపుడైన పరమాత్మనే సర్వదేహములయందు దర్శించవలయును. ఇట్టి జ్యోతిర్మయాకారుడైన పరమాత్మను దర్శించుట సగుణమని మనలో కొందరు అభిప్రాయపడుచున్నారు. ఇట్లు అభిప్రాయపడుట దర్శనమునకు విరుద్ధమేగాక పెద్దల అనుభవమునకున్నూ పెద్దల వాక్కిన్ని విరుద్ధమైయున్నది.

"బుద్ధిమంతులై పరతత్త్వంబుగాని జడంబును నిషేధించుచున్న సత్పురుషులు తమ తమ శరీరంబులయందు నిన్నరయుచుందురని గావున"

శ్రీ ఆ॥ భాగవతం దశమస్కంధము పూర్వభాగము 566 వచనం చివరను బ్రహ్మదేవుడు విష్ణునుద్దేశించి చెప్పినాడు.

ఆ. ప్రకృతికామకర్మపరవశమై యుచ్చ
నీచగతులఁబొంది నెఱయ బ్రిమసి
తిరుగుచున్న జగము తెలియనేరదు నిజ
గతి విశేషమీ జగంబునందు. 959

మ. అని చింతించి దయాళుఁడైన హరి మాయాదూరమై జ్యో
తియై యనిరూప్యంబయి సత్యమై మెఱుఁగై యానంద
మై బ్రహ్మమై యనఘాత్మల్ గుణనాశమందుగను నిత్యా
త్మీయ లోకంబు గ్రక్కునఁ జూపెం గరుణార్ద్రచిత్తుఁడ
గుచున్ గోపాలకశ్రేణికిన్. 960

వ. ఇట్లు హరి మున్ను క్రూరుండు వొందిన లోకంబంతయుం జూపి బ్రహ్మలోకంబు సూపినంజూచి నందాదులు పరమానందంబునంబొంది వెఱఁగుపడి హంసస్వరూపకుండైన కృష్ణునిం బొడగని పొగడి పూజించిరంత. 961

శ్రీ ఆం॥ భా॥ దశమస్కంధం పూర్వభాగంలో వున్నది.

సీ॥ వినుమాత్మవేత్తకు విష్ణుస్వరూపంబు నెఱుఁగంగఁ బడు
నదియెట్లటన్న । గగనస్థుఁడగు దినకరు కిరణచ్ఛాయ
జలముల గృహకుడ్య జాలకముల । వలనఁ దోఁచిన
ప్రతి ఫలితంబుచేత నూహింపంగఁబడిన యయ్యినుని
పగిది । సద్ధిమనోబుద్ధ్యహం కరణత్రయనాడీ ప్రకాశ
మునను నెఱుంగ ।

తే॥ గీ॥ వచ్చు నాత్మస్వరూపంబు నలఁతిగాఁగ
జిత్తమునఁదోఁచు నంచిత శ్రీదనర్చి
యమ్మహామూర్తి సర్వభూతాంతరాత్మ
డగుట నాత్మజ్ఞులకుఁగాన నగునుమఱియు.

శ్రీ ఆం॥ భా॥ తృతీయస్కంధము 911 పద్యములో ఉన్నది.

మ. బహుపాదోరు భుజాననేక్షణశిరః ఫాలశ్రవోయుక్తుఁడై
విహరించున్ బహుదేహిదేహగతుఁడై విద్వాంసులూహించిత
ద్బహురూపావయవంబులన్ భువనసంపత్తిన్ విచారింతురా
మహనీయాద్భుతమూర్తి యోగిజనహృన్మాన్యుండు మేధానిధీ

శ్రీ ఆ॥ భా॥ తృతీయస్కంధము 88 పద్యములో ఉన్నది.

సీ. పూర్ణుఁడయ్యును మహాభూతపంచకయోగమున మేను
లనుపురములు సృజించి । పురములలోనుండి పురుష
భావంబున దీపించు నెప్పుడు ధీరవృత్తి । పంచభూత
ములను పదునొకం డింద్రియములఁ బ్రకాశింపించి
భూరిమహిమ । షోడశాత్మకుఁడన శోభిల్లి జీవత్వవృత్తి
వినోదంబు నెఱపుచుండు

తే. గీ. నట్టి భగవంతుఁ డవ్యయుం డచ్యుతుండు
మానసోదిత వాక్పుష్ప మాలికలను
మంజునవరస మకరంద మహిమలుట్ట
శిష్టహృద్భావలీలల జేయుగాత.

శ్రీ ఆం॥ భా॥ ద్వితీయస్కంధం 68

ఉ. మానధనుల్ మహాత్ములు సమాధినిరూఢులు యన్ముఖాంబుజ। ధ్యానమరంద పానమున నాత్మభయంబులఁ బాసి ముక్తులై। లూనతనొందరట్టి మునిలోకశిఖామణికిన్ విశంకటా। జ్ఞానతమోనభోమణికి సాధుజనాగ్రణి కేను మ్రొక్కెదన్.

శ్రీ ఆం॥భా॥ ద్వితీయస్కంధము 69 లో ఉన్నది.

ఇప్పుడు పైన చెప్పిన భాగవతములోని ఉదాహరణల వల్లను భగవంతుడు జ్యోతిర్మయాకారుడై విరాట్పురుషరూపముతో మనలయందు నిలిచి అవిద్యావశుడైన జీవుడుగా ఉన్నట్టు స్పష్టమగుచున్నది. అట్టి జీవపరమాత్మలను మహాత్ములు దర్శించుచుందురనునదికూడా అవివాదాంశమే. భగవంతుడు దర్శన మిచ్చుచున్నాడన్నందుకు యింకను అనేక చోట్ల అనేక ప్రమాణములు కలవు. గ్రంథ విస్తర భీతిచే యిచ్చట నుదాహరించలేదు. ఉన్నది ఒక్క విరాట్పురుషుడే గాని వేరేమియు లేదు. ఆవిరాట్పురుషుడే సృష్టికి సంబంధించినప్పుడెల్లనూ జీవేశ్వర దేహజగత్తులుగా ప్రకాశించుచున్నాడు. దేహముకు జీవుడు జగత్తుకు యీశ్వరుడు అధిపతులుగా ఉంటున్నారు. జీవేశ్వరులు చైతన్య స్వరూపులు. దేహ జగ

ములు జడమైన మాయారూపములు. 'నేతి నేతీతి వాక్యైతి శేషితం పూర్ణముచ్ఛతే' అను వేదప్రమాణమునుబట్టి యిది కాదు యిది కాదు అని నిషేధించగా మిగిలినది పూర్ణమయ్యున్నది. మనము నిషేధించునది బాహ్యమందు కనపడు సర్వ వస్తువులును అంతరమందు కనపడు ఇంద్రియములు విషయములును అయియున్నది. దేహమందు జీవుడు యేతీరుగా వున్నది గుణములతో కూడి విషయములను యేతీరుగా అనుభవించుచున్నది, దేహావసానకాలమందు జీవుడు యేతీరుగా పోవుచున్నది జ్ఞాని కనుక్కోవలసిన సంగతి అయివున్నది. సదా మూఢు వ్యవహారములయందు చనిపోవునప్పుడు దేహములో వున్నప్పుడు విషయములను అనుభవించుచున్నప్పుడు జీవుని అజ్ఞాని చూడడం లేదు. జ్ఞాని చూచుచున్నాడు అని భగవద్గీతలలో 15 అధ్యాయములో 10 శ్లోకమందు వున్నది.

ఇట్టి జీవుడు నేతి నేతి వాక్యములవల్ల విభజింపగా కేవలము ప్రత్యగాత్మ స్వరూపుడై యున్నాడు ప్రత్యగాత్మ అనగా వేరైన ఆత్మ అని అర్థము మన దేహము, ఇంద్రియములు, విషయములు అంతరంగము అనగా మనో బుద్ధి చిత్త అహంకారములు, అజ్ఞానము మొదలయిన అన్నిటితోను కలసియున్నట్టు కనపడుతూ వాటి అన్నిటికి వేరుగావున్నట్టి ఆత్మయే ప్రత్యగాత్మ. ఈప్రత్యగాత్మ దేహప్రపంచకములను అన్నిటిని యెరుగుచున్నాడు. ఎట్లాగనగా నాయిల్లు నాధనం నాభార్య, నాపిల్లలు, నాదేహము, నాయింద్రియములు, నామనస్సు అని అన్నిటికి తాను కర్తయై యెరుగుచూ అని

అన్నియు తానుగాక తాను వేరైన ఆత్మగానేఉన్నాడు. ఇట్టి వేరైన ప్రత్యగాత్మ యీశ్వరునియొక్క వ్యష్టి హాంశ అయి వున్నాడు. మరిన్ని "ప్రజ్ఞానం బ్రహ్మ" అని చెప్పబడిన ప్రజ్ఞానమే యీప్రత్యగాత్మ అయివున్నది. మహావాక్యము లనుపట్టి ప్రజ్ఞానము బ్రహ్మమే అయివున్నది. గనుక వ్యష్టి ఉపాధిలోవున్న ప్రజ్ఞానవాచ్య ప్రత్యగాత్మను దర్శించుటే బ్రహ్మమును దర్శించుట.

సూదిని తీసుకునివెళ్ళి దూలముకుగుచ్చి పదిమంది మోయుటకంటె సూదిని బహుతేలికగానే మనము తీసుకుని వెళ్ళగలము. అయితే సూదిపడి పోకుండానుమనకు గుచ్చుకుని బాధ కలుగ కుండాను మనము బాగా పట్టుకున్న చాలును. ఈమోస్తరుగానే మనము ప్రజ్ఞానస్వరూప ప్రత్యగాత్మను పంచకోశములయందు ఆరోపించి కోశములు ఆత్మగావని విచారించి పంచకోశములకు అతీతమైన ప్రజ్ఞానమే నేనని ధృఢముగా కనుక్కోవలయును. ఇట్లు కనుగొనుటే దర్శనము. ఈదర్శనమునుగురించే అహంగ్రాహిని ప్రథమ గ్రంథములో సాధారణముగా ప్రతి అధ్యాయములోను సందర్భానుసారముగా వ్రాయబడియున్నది. దృగ్మయ బ్రహ్మమును గురించే మనము యెక్కువగా విచారించి దర్శించ వలసియున్నది. ఈదర్శనమే మనము యెక్కువ పరిశ్రమ చేసి సంపాదించవలసినది అయివున్నది.

యజుర్వేదమందలి అహం బ్రహ్మాస్మి.
సామవేదమందలి తత్వమసి.

ఋగ్వేదమందలి ప్రజ్ఞానం బ్రహ్మ.
అథర్వణవేదమందలి అయమాత్మాబ్రహ్మ.

అను నాలుగు మహావాక్యముల అర్థమున్ను దర్శనమే అయివున్నది. అహం, త్వం, ప్రజ్ఞానము, అయమాత్మ యీ నాలుగున్ను దృగ్మయ ప్రత్యగాత్మయున్ను బ్రహ్మ, తత్, బ్రహ్మ, బ్రహ్మ, అనునవి పరమాత్మయున్ను అయివున్నవి. ఈదర్శనము వేదసమ్మతమైయున్నది గాని వేదమునకు వ్యతిరేకముగా లేదు.

శ్రీజగద్గురు ఆదిశంకరులవారు కూడా శ్రీరామకర్ణామృతములో శ్రీరాముని సహస్రారస్థిత అణుమాత్ర మహాకళయందే వర్ణించినారు.

శ్లో॥ తారాకారం నిఖిలనిలయం తత్వమస్యాది లక్ష్యం
శబ్దావాచ్యం త్రిగుణరహితం వ్యోమ మంగుష్ఠమాత్రం
నిర్వాణాఖ్యం సగుణమగుణం వ్యోమరంధ్రాంతరాసం
సాషుమ్నాంతః ప్రణవరహితం రామచంద్రం భజేహం॥
శ్రీరామకర్ణామృతము ఆశ్వాసం 2 శ్లో 48

ఈశ్లోకమందు

తారాకారం = జ్యోతిర్గణములోని నక్షత్రస్వరూపుడుగాను
నిఖిలనిలయం = సర్వమునకు ఉనికిపట్టుగాను
తత్వమస్యాదిలక్ష్యం = తత్వమసి మొదలగు నాలుగు మహా వాక్యములచేత లక్ష్యభూతునిగాను అనగా చూడతగినవానిగాను

శబ్దావాచ్యం = ఓంకారస్వరూపుడుగాను నోట వచించుటకు వీలులేనివానిగాను

త్రిగుణరహితం = సత్వరజస్తమోగుణములు లేనివానిగను

వ్యోమమంగుష్టమాత్రం=చిదాకాశ స్వరూపుడుగను అంగుష్ట మాత్రుడుగాను

నిర్వాణాఖ్యం = నిర్వాణము అనగా మోక్షమే పేరుగలవాడు గాను

సగుణమగుణం = సగుణనిర్గుణస్వరూపుడుగాను

వ్యోమరంధ్రాంతరాసం = అణువైన ఆకాశ రంధ్రమందు ఉండువానిగాను

సౌషుమ్నాంతః=సుషుమ్న నాడి అంతమందు అనగా సుషుమ్న కళయందుండువానిగను

ప్రణవరహితం=ఓంకారము అనగా నాదమునకు మీరినవాని గాను

రామచంద్రంభజేహం=రామచంద్రుని భజించుచున్నాను అని చెప్పబడియున్నది.

ఇట్టి శ్లోకములు యింకనూ కొన్ని పై గ్రంథములోనే ఉన్నవి. గ్రంథవిస్తరభీతిచే నిచట వ్రాయలేదు. గ్రంథ దృష్టాంతములను పట్టి భగవంతుని దర్శనము వర్ణించబడి యున్నది.

శివునిగాని విష్ణునిగాని సుషుమ్న కళయందె మహా త్ములు వర్ణించియున్నారు. ఈదర్శనము సుషుమ్నకళయందె

చూడతగియున్నది. సుషుమ్న వెన్నెముకను యిడ, పింగళల మధ్య ఆధారము లగాయతు సహస్రారము వరకు వ్యాపించి యున్నది. ఈఅహంగ్రాహిని ప్రథమగ్రంథములో 18 ప్రకరణ బ్రహ్మరంధ్రాన్వేషణలో "అధఃబ్రహ్మబిలము" "ఊర్ధ్వ బ్రహ్మబిలము"ల క్రింద సుషుమ్నానాడి ఆది అంత్యములు వివరించబడియున్నవి. మనదిరాజయోగ సాంప్రదాయకనుక సుషుమ్నాంతమును పరిశీలించుటే వ్యాయము. ఈశ్వర ప్రణిధాన లక్షణమందుకూడా శ్రీరాముని సహస్రారమందే సుషుమ్నాంతమందే వర్ణించియున్నారు.

సగుణనిర్గుణములు రెండున్నూ సుషుమ్న యందలి కళే అయివున్నవి. ఈకళే దృక్కు అయివున్నది.

శ్లో॥ దృగ్దృశౌ ద్వౌపదార్థౌతుపరస్పరవిలక్షణౌ
దృగ్బ్రహ్మదృశ్యమాయేతిసర్వవేదార్థడిండిమః

అని యున్నది. గనుక దృక్కు బ్రహ్మమే అయివున్నది.

ఈదృక్పదార్థమును గురించి ఈఅహంగ్రాహిని ప్రథమ గ్రంథము 20 ప్రకరణములలో విపులముగా వ్రాయబడి యున్నది.

ఇట్టి దర్శనము మన మందరమున్నూ చేయుటకు అర్హులమే గాని అనర్హులము కాము. ప్రత్యగాత్మ స్వరూపుల మైన మన మందరము మన స్వరూపమును మనము చూచుటకు అర్హులము. ఈఅర్హత మన స్వరూపమును మనకు కన పర్చగల కారణ గురువు అనుగ్రహమువల్ల కలుగును. కారణ

గురువు అనుగ్రహమునకు పాత్రుడు సాధనచతుష్టయ సంపన్నుడై యుండవలయును. సాధనచతుష్టయసంపన్నుడుఅర్హుడు. గనుక మన మందరము సాధనచతుష్టయసంపన్నులమై కారణ గురువుల అనుగ్రహమును పొంది మన స్వరూపమును మనము దర్శించి విశ్వాద్రూపపరమాత్మను పొంద ప్రయత్నించవలయును. ప్రత్యగాత్మ పరమాత్మలె జీవబ్రహ్మలు.

బ్రహ్మము జీవమేఅయివున్నాడు. జీవుడు బ్రహ్మమై యున్నాడు జీవదర్శనమే బ్రహ్మదర్శనము. వ్యష్టిసమష్టిలో అంతర్యామితము గనుక జీవుడు బ్రహ్మలో అంతర్యామితుడు అయివున్నాడు గనుక జీవుని పూర్ణముగా విచారించుట బ్రహ్మమును విచారించుటే అయివున్నది.

జీవుడు అహంపదార్థవాచ్యుడే అయివున్నాడు. అహం పదమనగా నేననేమాట. గనుక నావిచారణయే అహం, జీవ, బ్రహ్మల విచారణ అయివున్నది. ఇట్టి నేను సహస్రార చక్రమందుండెడి అష్టకమలము మధ్యనున్న పంచభూతములు సప్తసముద్రములు, అష్టతనువులు మధ్యన నీవారశూకముగా మహాకళతో ప్రకాశించెడి సుషుమ్నానాడియందు ప్రత్యగాత్మగా ప్రకాశించుచున్న బ్రహ్మమైయున్న పరమాత్మనే అయివున్నాను.

అణుమాత్ర మహాకళయైన సుషుమ్నానాడి మధ్య బ్రహ్మస్వరూప ప్రత్యగాత్మనైన నేను శైవ వైష్ణవ విభూతులతో ప్రకాశించుచున్నాను. నన్ను నేను సహస్రారస్థిత

సుషుమ్నకళయందే శివునిగాను, విష్ణువుగాను దర్శించుటే దర్శనము. కుడికంటితో చూచినయెడల శివుడుగాను ఎడమకంటితో చూచినయడల విష్ణువుగాను ప్రత్యగాత్మయైన నేను దర్శనమగుచున్నాను. సుషుమ్నాంతర్గత మహాకళే కుడికంటి చూపుకు శివలోకముగాను ఎడమకంటిచూపుకు విష్ణులోకము గాను దర్శనమగుచున్నది.

ఈదర్శనము నశించునదికాదు. ఏలయనగా దృక్పదార్థము నశించెడి దృశ్యమైన మాయాజనితము కాదుగనుక బ్రహ్మమై యున్నది. దృక్పదార్థము బ్రహ్మమనుట వేద సమ్మతము.

గనుక నేను కుడినేత్రముతో ప్రత్యగాత్మనైన నన్ను చూచిన యెడల శివునిగాను ఎడమనేత్రముతో ప్రత్యగాత్మనైన నన్ను చూచిన యెడల విష్ణువుగాను కనపడుచున్నాను. నాస్వరూపులైన శివకేశవుల నిద్దరిని నేను దర్శించుచున్నాను. నేను సృష్టి లగాయతు ఇంతవరకు కనిచూడని నాశివకేశవ స్వరూపములను నేను దర్శించుచున్నాను. ఇది యెంత గొప్ప అదృష్టము. అదృష్టము అనగాదృష్టము కానిది. దృష్టము అనగా కనపడునది. అదృష్టము అనగా కనపడనిది.

లోకమునకు నాస్వరూపము అదృష్టము. అనగా లోకమునకు కనుపించదు. నాకు నాస్వరూపము దృష్టము. అనగా నాస్వరూపము నాకు కనపడుచున్నది. అనగా నాస్వరూపము నాకు దర్శనమగుచున్నది అని జ్ఞాని యిట్లు సంతోషించును.

ఇట్టి దర్శనము బ్రహ్మస్వరూపులమైన మన మందరము మనలో పొందగలము. మనకు బాహ్యమున మనము విచారించవలసిన పని లేదు. మనము మన దేహములో సహస్రారస్థితసుషుమ్న కళయందే మన శైవవైష్ణవవిభూతులను దర్శించవలయును.

వ్యవహారమునకు శైవవైష్ణవవిభూతులు కలిగివున్నవి. అనుభవమువల్ల ప్రత్యగాత్మ శివకేశవస్వరూపు డయ్యేయున్నాడు. ప్రత్యగాత్మ స్వరూపులమైన మన మందరము శివకేశవస్వరూపులమయ్యేయున్నాము. శివకేశవస్వరూపములు నిర్గుణపరబ్రహ్మస్వరూపులయిన ప్రత్యగాత్మ పరమాత్మలకు యెంతమాత్రము లేవు అని వాదించువారు, ఉద్దేశించువారు ప్రత్యగాత్మను సవ్యాపసవ్యచూపులవల్ల దర్శించనివారని మనము రూఢిగా నమ్మవలసినదే. ఈవిద్య అతిరహస్యమున్ను బట్టబయలున్నూ అయివున్నది. వడ్లగింజలోనిది బియ్యపుగింజే. అయితే వడ్లగింజ మాడ్చినయెడలగాని పైపొట్టు తీసిన యెడలగాని సృష్టికి రాదు. పైపొట్టు పోయినయెడల వడ్లగింజే బియ్యపుగింజ అవుచున్నది. ప్రత్యగాత్మ తనను తాను సవ్యాపసవ్యచూపులవల్ల చూచినప్పుడు శివకేశవస్వరూపుడే అయివున్నట్టు స్పష్టముగా కనపడగలదు. ఇది నిజమైనది లేనిది నూటిమార్గస్థులబోధవల్ల సవ్యాపసవ్యచూపులవల్ల కనుగొనరాదా యేమి? మీరు మీఅంతటచూస్తే కనుపించు దానికి ఊహాలు సందేహములు పెట్టుకొనుట యేమి ప్రయోజనము? యెవరికి వారే యెమునాతీరే అను సామెతను మన మందర మెరుగుదుము. దర్శనము లేనివారందరు వస్తుతః పరమాత్మ

స్వరూపులైనను పరమాత్మకు యేర్పడియున్న శివకేశవస్వరూపములను దర్శింపజాలరు. దర్శనమే ముఖ్య ప్రమాణము. దర్శనమే సత్యము.

యవరికివారే యమునాతీరే అనుసామిత మనకు వాడుకలోనేయున్నది. సహస్రారచక్రమునందు గంగ యమున సరస్వతులు స్వరూపములతో ఉన్నవి. జీవుడు తన సుషుమ్న నగరమునుంచి బైలుదేరి గంగా యమునా సరస్వతులను నదులనుదాటి సహస్రారములు గలిగి వెళ్లిగెడు కళాపట్నమందు ప్రవేశించును. ఆపట్నమందు వీధుల నన్నిటినిదాటి అణువులో అణువైన ముక్తికాంతామణితో కలిసి జీవుడు తన మామూలుచోటికివచ్చి ప్రతిదినము ఇట్లు చేరుచుండును. ఇది లోచూపువారిలో ఒక తెగవారి మార్గము. ఈమార్గము వారికి జీవకళయు ఈశ్వరకళయు కనుపించును. తక్కిన తెగవారు ఈశ్వరకళనే సుషుమ్నానాడి కళగా చెప్పుచున్నారు.

ఇప్పుడు మనదర్శనమునకు సంబంధించిన మట్టుకే మనము ప్రసంగించుదము.

ఇప్పుడు లోచూపుమార్గస్థులు కళ నిష్కళ వరకు మట్టుకు దర్శించి అంతటితోనే తాము కృతకృత్యులమైనామని అనుకొనుట తటస్థించుచున్నదిగాని కళా నిష్కళలను నియమముతో చూచుటయును సవ్యాపసవ్య దృష్టులవల్ల శివకేశవులను వారివారి విశ్వరూప సందర్శనములను దర్శించుటయును కలలోనివార్తగా ఉంటున్నది. నేనున్నా

ఆన 1922 సం॥ వరకు ఈమోస్తరుగానే చెప్పుచుండేటి వాడను ఆన 1925 సం॥ రం ఫిబ్రవరి నెలలో కళనిష్కళలయందు శివకేశవులను శైవ వైష్ణవ విభూతులను నిర్ధారణ చేయగల సామర్థ్యము కలిగి యీఅహంగ్రాహిని ప్రథమ గ్రంధము యొక్క అవతారికలోని కారణములను పట్టి సదరు గ్రంథమును పూర్తి చేసినాను. నాకు కనుపించినసంగతులు అన్నియితర్లు అందరూ పరిశీలిస్తె కనుపించతగినవిగాని అధ్యాత్మ విద్యయందలి ఊహాపోహలచే తఉద్దేశించ తగినవికావు. ఈపరిశీలనకు ఒకతెగవారేకాదు. ఏమతము తాలూకైనా ఏతెగవారైనా అర్హులు. ఐతే అట్టి పరిశీలనకు గడంగువారు సూటిమార్గమవలంబించినవారుగా నుండవలెను. ఏమతస్తులైనను యేతెగవారైనను సూటిమార్గమవలంబించి చూచినయెడల శివకేశవ స్వరూపములు శైవ వైష్ణవ విభూతులు వారివారి సహస్రారస్థిత షుషుమ్నకళయందే వారు దర్శించగలరు. శివకేశవులు శైవవైష్ణవ విభూతులు అందరియందును అంతటను నిండివున్నవి గనుకనే యేమాత్రము అనుమానము లేకుండా ప్రతివారియందును కనుపించును. సరిగా అనుమానములేకుండా కనుపించుదానికి మతముల నిర్ణయములు యేమి అడ్డమువచ్చును?

### దర్శనము—శైవము.

సహస్రారస్థిత సూర్యచంద్రాగ్ని మండలముల మధ్యవున్న అణుమాత్రమహాకళను అందలి నిష్కళను కుడికంటి దృష్టితో చూడవలయును. కేవలము శివస్వరూపము దర్శన

మగును. దృష్టి కుదిరిన కొలది పైభాగమున అర్ధచంద్రుడు ముందుగా కనుపించును. ఆఅర్ధచంద్రునిక్రింద నాగాభరణము అనగా నాగేంద్రుని శిరస్సులు కనుపించును. నాగాభరణము క్రింద గంగాదేవిముఖము కనుపించును. గంగాదేవి ముఖమును చూడగానే పరిశీలనగా చూడనియెడల గంగాదేవిగాన కనుపించును. బాగా పరిశీలించిచూచినయెడల గంగాదేవి శివుని జడలలో చిక్కి వుండును. జడలు పరిశీలించగా శివుని ముఖము బాగా కనుపించును. వామభాగమందు పార్వతి కనుపించును. ఇట్టి స్వరూపము కళ మధ్యమందు ముందుగా కనుపించే నారసింహ ముఖము కనుపించి ఆమూర్తియొక్క తక్కిన ఆకృతులు దృశ్యమైన తరువాతను కనుపించును. మరీ నిలకడ దృష్టితో చూడగాచూడగా శైవవిశ్వరూపసందర్శనము కనుపించును.

## దర్శనము—వైష్ణవము.

సహస్రారస్థిత సూర్యచంద్రాగ్నిమండలముల మధ్య వున్న అణుమాత్రమహాకళను అందలి నిమ్నకళను ఎడమకంటి దృష్టితో చూడవలయును. నరసింహమూర్తి ముఖము కనుపించును. దర్శించగా దర్శించగా తొమ్మిది విధములైన నారసింహముఖములు కనుపించును. ఒకటి తరువాత యింకొకటి యింకొక విధముగా కనుపించును. అటుతర్వాత దర్శించగా దర్శించగా శ్రీవైకుంఠ నాయకుడైన విష్ణుని ముఖము కనుపించును. ఆదిశేషుని తలలక్రింద శ్రీమహావిష్ణువు ముఖము కనుపించును. ఈనారసింహ విష్ణుమూర్తుల యొక్క స్వరూపములు

చూచితీరవలసినదేగాని చెప్పను వ్రాయను అలవికాదు. మరీ నిలకడ దృష్టితో చూడగా చూడగా వైష్ణవ విశ్వరూప సందర్శనము కనుపించును.

## శైవ వైష్ణవదర్శనములు.

సహస్రారస్థిత సునీల బిందువందలి కళనిమ్న ళలే కుడి చూపుకు శైవముగాను యెడమ చూపుకు వైష్ణవముగాను కనుపించుచున్నవి. కళాసహిత నిమ్నళే శివకేశవ స్వరూపములు కుడి యెడమ చూపులనుపట్టి అయివున్నది. విరాట్పురుషుడు యేర్పడినది లగాయతు శైవవైష్ణవ విభూతులు ప్రతి అణువునందును నిండియున్నవి. "కశ్చిద్భగవాన్ మహేశశ్శంకర నారాయణాత్మైకః" అని శ్రీ ఆదిశంకరాచార్య స్వాములవారు స్వరచిత ప్రశ్నోత్తర రత్నావళియందు సిద్ధాంతీకరించినారు.

ఈసంగతి యీఅహంగ్రాహిని ప్రథమ గ్రంథము 15 ప్రకరణ ఆఖరున తెలియపరిచి యుండడమైనది.

ఈ శైవవైష్ణవ దర్శనములు యీఅహంగ్రాహిని ప్రథమ గ్రంథములో 21 ప్రకరణములో కుడియెడమ కొలికి సూటి చూపులు విభజించుటలో బాగా వర్ణించబడియున్నది.

గ్రంథదృష్టాంతములను పట్టియు, చూపుల అనుభవమును పట్టియు చూచినయెడల భగవద్దర్శనము నమ్మతగియున్నది. ఉపమాన అనుమానములవల్ల ఊహించి పొంద

తగినది కాదు. దర్శనమునకు వేరే దర్శనము అవసరము లేదు. సాధనచతుష్టయము కలవాడే సమాహితచిత్తము కలవాడు. సమాహిత చిత్తమునుగురించి యీఅహంగ్రాహిని ప్రథమగ్రంథము 25 ప్రకరణములో వివరించబడియున్నది.

మానవజాతివారమైన మన మందరము స్త్రీపురుష భేదము లేకుండా భగవంతుని దర్శించుటకు ఉపాయములు పెద్దలు కనిపెట్టి లిఖించియున్నారు. గురువులు ఉపదేశించుచున్నారు. బుద్ధిమంతులు భగవంతుని దర్శించుచున్నారు.

ఓం. ఓం. ఓం.

సమాప్తమ్.

***